# పాఠకులకు మనవి

విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ రచనలను గురించి వారి మహోన్నతభావాలను గురించి చెప్పటం చర్విత చరణమే. మహర్షి ఠాగూర్ రచనలు యిప్పటికి మా ప్రచురణాలయం ద్వారా నాలుగు నవలలు: 1. జల్‌జలా. 2. రాజఋషి. 3. అక్కాచెల్లెలు. 4. చారులత. పాఠకలోకానికి చేరాయి. ఇది మా అయిదవ పుస్తకం. దీన్నికూడా పాఠకులు ఆదరిస్తారని నమ్ముతున్నాం. అతిత్వరలోనే విశ్వకవి రచనలన్నింటినీ సంపుటములుగా తమకందించడానికి అవిరామకృషి సల్పుతున్నాం. మీ ఆదరాభిమానంతో త్వరలోనే ఈ కృషిలో కృతకృత్యుల మౌతామని ఆశిస్తున్నాము.

ఇట్లు,

ప్రకాశకులు.

ఇందులో,

సుభ

అనుమానం

నదిమెట్లు

నాటిరేయి

కాబూలీవాలా

అనగా అనగా ఒకరాజు

విషకన్య

పరిసమాప్తి

చిట్టిపేక దేశం

# సుభ

ఆ పిల్లకు సుభాషిణి అని పేరుపెట్టినప్పుడు పెరిగి పెద్దదయిన తర్వాత మూగదవుతుందని యెవరు మాత్రం అనుకొని ఉంటారు? ఆమె అక్కలిద్దరి పేర్లు సుకేశిని, సుహాసిని. ఆ పేర్లతో సమానంగా ఉండేందుకు ఈపిల్లకు సుభాషిణి అని పేరు పెట్టారు. ముద్దుగా సుభ అని పిలుస్తారు.

సుభ అక్కలిద్దరికీ పెండ్లిళ్ళు కావటం మహా ఘనమైపోయింది. కట్నాలుపోసి వరుల్ని తెచ్చేటప్పటికి తల్లిదండ్రులు సతమతమైపోయారు. అలాంటప్పుడు సుభకు పెండ్లి కావటం మాటల్లోవుందా? తల్లిదండ్రులకు గుండెలమీది కుంపటిగా తయారయింది, సుభ. ఆపిల్లకు మాటలు రావుగాబట్టి ఆ విచారమేమీ అర్థంకాదని అందరూ అనుకునేవారు. ఆపిల్లముందే ఆపిల్లస్థితిని గురించి, భవిష్యత్తునుగురించి మాట్లాడుకొనేవారు. సుభ తాను తనతలిదండ్రులకు ఒక భరింపరాని బాధగా తయారైనానని బాల్యంనుంచే గ్రహించింది. అందువల్ల అందరికీ దూరంగావుంటూ యేకాంతంగా కాలాన్ని గడుపుతూ వుండేది. అందరూ తననుగురించి మరిచిపోయినట్లయితే ఎంత బాగుండునని అనుకొనేది. అలా తనను అందరూ మరచిపోతే తన దుఃఖభాజనమైన జీవితాన్ని సులభంగా భరించగలనని భావించుకొనేది. కాని బాధను యెవరుమరచిపోగలరు? రాత్రింబగళ్ళు ఆమె తలిదండ్రులు ఆమెను గురించిన మనోవ్యాధితో వ్యథపడుతూ ఉండేవారు. ముఖ్యంగా ఆమెతల్లి సుభను ఒక

వికలాంగనిగా భావించేది. సాధారణంగా తల్లులకు తమ కొడుకులకంటే కూడా కూతుళ్ళతో యెక్కువ సాన్నిహిత్యం వుంటుంది. అటువంటి కూతుళ్ళలో యేదైనా లోపం వున్నట్లయితే తల్లి హృదయానికి అది కనపడని గాయంగా తయారై యమయాతనను కలుగజేస్తుంది. సుభతండ్రి ఆమెను తన తక్కిన కూతుళ్ళకంటేగూడా యెక్కువగా ప్రేమించేవాడు. కాని ఆమె తల్లిమాత్రం సుభను తనకు ఒక మాయని మచ్చగా భావించుకొని ఆమెను ద్వేషించుకొనేది.

సుభకు నోటిమాట లేకపోయినా, ఆమె నేత్రద్వయం మాత్రం అందర్నీ ఆకర్షిస్తాయి. పెద్దరెప్పలతో కూడిన విశాలనేత్రాలు యెంతో అందంగా అగుపించేవి. ఆమె మనస్సులో యేదైనా భావం కలిగినప్పుడు దానికనుగుణంగా పెదవులు కదిలేవి.

సాధారణంగా మన మేధస్సులో కలిగే ఆలోచనలను మాటలలో ప్రకటించుట సులభంకాదు. మన భావం ప్రస్ఫుటంగా తెలియజేయుట కష్టసాధ్యమవుతుంది. కాని నల్లని విశాల నేత్రాలకు అటువంటి బాధేమీ వుండదు. మేధస్సే తన ఛాయలను వాటిలో ప్రతిఫలింప జేస్తుంది. మనస్సులోని భావాలన్నీ చెక్కు చెదరకుండా వ్యక్తమవుతూ వుంటాయి. పుట్టినది మొదలు తమ భావాలను ప్రకటించుకొనుటకు నోటమాట లేనివారు నేత్రాలద్వారా మాటలాడే యీభాషను అలవరచుకొంటారు. విశ్వంవలె అనంతమయినది, సముద్రంవలె అగాధమయినదీ యీభాష. ప్రకృతిలో ప్రత్యక్షమయ్యే గంభీరత, మూగవారిలో ద్యోతకమవుతుంది. అందువల్ల యితర బాల

బాలికలు సుభను చూచి భయపడేవారు. ఆమెతో ఆడుకొనే వారుకారు. సహచరులు లేకుండా యేకాకిగా బ్రతుకుతుండేదా పిల్ల.

చాందీపూర్ అను ఒకచిన్న గ్రామంలో నివసిస్తుండేది సుభ. ఒక చిన్ననది ఆ గ్రామంగుండా ప్రవహిస్తుండేది. ఆ నది యేనాడూ నిండుగా వుండేదికాదు. కాని గ్రామంలోని ప్రతి యింటికి కావలసిన నీటి అవసరాలను తీరుస్తూవుండేది. నదికి యిరుప్రక్కలా ఇండ్లు, పెద్దపెద్ద వృక్షాలు తీర్చివుండేవి. ఆ గ్రామంలోని ప్రతివాళ్ళు ఆనదిని తమ యిలవేల్పుగా భావించుకొనేవారు.

సుభ తండ్రియిల్లుకూడా యీ నదిఒడ్డునే వున్నది. నదిలో తమ పడవలలో పోయే ప్రతి పడవవానికి నదిఒడ్డున వున్న ఇండ్లు, చెట్లుచేమలు బాగా తెలుసు. కాని ప్రాపంచికమైన యీవిషయాలన్నిటితో అంతపరిచయంగల వాళ్ళలో యేఒక్కరైనా ఆచిన్నపిల్ల సుభను గుర్తించేవాళో లేదో నేను చెప్పలేను. సుభ తన పనులన్నీ అయిపోయిన తర్వాత యెవ్వరికీ తెలియకుండా నెమ్మదిగా వెళ్ళిపోయి నదిఒడ్డున కూర్చొనేది. ఇక్కడ ప్రకృతి ఆపిల్లలోని మాటలేని కొరతను తీరుస్తూ తనకుతానై మాటలాడేది. నది మర్మరధ్వని, గ్రామ ప్రజల కంఠస్వరాలు, పడవవాళ్ళ పాటలు, పక్షుల కిలకిలలు కలసి ఆమూగపిల్ల సుభ హృదయస్పందనను వ్యక్తపరచేవి. అవన్నీ ఒక అలగావచ్చి పరితపించే ఆమె హృదయాన్ని తాకేవి. ప్రకృతి యొక్క మర్మరధ్వనియే ఆ మూగపిల్ల యొక్క భాష. ఆభాషయే ఆమె నల్లని విశాల నేత్రాలలో

వ్యక్తమయ్యేది. మధ్యాహ్నంపూట పడవలవాళ్ళు భోజనా లకు పోయినప్పుడు, గ్రామస్తులు బడలిక తీర్చుకొంటున్న ప్పుడు ప్రశాంతమైన మూగప్రకృతితోపాటు మూగపిల్ల సుభ అక్కడ యేకాకిగా కూర్చొని వుండేది.

కాని సుభకు అసలు స్నేహితులు: లేనేలేరని చెప్ప టానికి వీల్లేదు. వాళ్ళగొడ్ల కొట్టంలో గంగు, లక్ష్మి అనే రెండు ఆవులుండేవి. ఆ ఆవులు తమపేరు సుభ, ఉచ్చరించ టం యెన్నడూ వినలేదు. కాని అవి ఆపిల్ల కాలిచప్పుడును బట్టే గుర్తుపట్టేవి. ఆమె మాటలాడలేకపోయినా వాటితో యేదో అవ్యక్తంగా గొణిగేది. అవి మాటలకంటే సులభంగా ఆ గొణుగుడును అర్థంచేసుకొనేవి. సుభ వాటిని బుజ్జగించి నప్పుడు, తిట్టినప్పుడు ఆ ఆవులు మానవులకంటే చక్కగా వాటిని గ్రహించేవి. సుభ కొట్టంలోకి వచ్చి గంగు మెడను కావిలించుకొనేది. చెంపలతో దానిని నిమిరేది. లక్ష్మి తన మృదువైన చూపులను అటుత్రిప్పి సుభముఖాన్ని నాకేది. సుభ రోజుకు మూడుసార్లు తప్పక కొట్టంలోకి వచ్చి వాటిని చూచిపోతుండేది. ఒకొక్కనాడు ఇంకా ఎక్కువసార్లువచ్చి చూచిపోతుండేది. ఆమె హృదయానికి బాధకలిగించే మాట లేవైనా విన్నప్పుడు, సాధారణంగా వాటిని చూడటానికి వచ్చే సమయం కాకపోయినా వాటిదగ్గరకు వెళ్ళేది. ఆమె కండ్లలోని విషాదచ్ఛాయలను ఆ ఆవులు గమనించినట్లే అగుపించేవి. అవి సుభదగ్గరకుచేరి కొమ్ములు ఆమె శరీరానికి రాచేవి. మూగభాషలోనే ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించేవి. ఈ ఆవులేగాక వాళ్ళయింట్లో మేకలు, ఒక పిల్లికూన కూడా

ఉండేవి. అవన్నీ సుభకు అదేవిధంగా సానుభూతి చూపినా సుభమాత్రం వాటన్నిటితోనూ, యీ ఆవులతో ఉన్నంత స్నేహంగా ఉండేదికాదు. పిల్లికూన రాత్రిగాని, పగలుగాని దానికి అవకాశం దొరికినప్పుడు సుభ ఒడిలోకిచేరి నిద్రపోయేది. ఆపిల్లికూన తనపై చూపే ప్రేమను సుభ గ్రహించి దానిని తన వ్రేళ్ళతో నిమిరేది.

సుభకు ఉన్నతజాతి జంతువులయిన మానవులలో గూడా స్నేహితులు లేకపోలేదు, గోసాయిల కడసారి పిల్లవాడే ఆస్నేహితుడు. ఆపిల్లవాడిపేరు ప్రతాప్. పనిపాటలు లేకుండా సోమరిగా ఊళ్ళో తిరుగుతుంటాడు. సుభకు యీ కుర్రవానితోగల సంబంధాలేమిటో చెప్పటం కష్టం. ఎందుకంటే, అతను మాట్లాడగలడు. మాట్లాడగలవారు మూగభాషను అర్థంచేసుకొనలేరు. కాబట్టి సుభ భాషను అర్థంచేసుకొనజాలని ప్రతాప్‌తో ఆమెకుగల సంబంధాలేమిటో తెలియదు.

ప్రతాప్ ఎప్పుడూ పనిపాటలులేక గాలిగా ఊళ్ళో తిరుగుతుంటాడు. ఏదైనా ఒకపనిలో ప్రవేశపెట్టడానికి ప్రతాప్ తల్లిదండ్రులు విశ్వప్రయత్నం చేశారు. కాని లాభం లేకపోయింది. ఇలా గాలికి తిరిగేవారు తమ ఇంట్లోవాళ్ళకు యే విధంగాను ఉపయోగపడకపోయినా, ఊళ్ళోని వాళ్ళందరి దగ్గరనుంచీ ప్రాపకం సంపాదించుకొంటూరు. వాళ్ళను కట్టి పడేసే బాధ్యతగల పనులేమీ ఉండవుగాబట్టి, వారు ఊళ్ళోని వారందరి సొత్తుగా తయారవుతారు. ప్రతినగరానికీ, ఆనగరంలోని ప్రజలు విశ్రాంతి తీసుకొనేందుకు ఒక పచ్చిక బయలు

అవసరమైనట్లే, ప్రతి గ్రామానికీ ఆ గ్రామప్రజలను తీరికసమయాల్లో వినోదపరిచేందుకు పనిపాటలు లేకుండా తిరిగేవాళ్ళు ఒకరో, యిద్దరో అవసరమైవుంటారు. ఏపనీ లేకుండావున్నప్పుడు అటువంటి వాళ్ళతో కూర్చొని బాతాఖానీ కొడుతుంటారు.

ప్రతాప్‌కు చాపలుపట్టటమంటే మహాసరదా. తన కాలంలో అధికభాగం యీపనిలోనే గడుపుతుంటాడు. ఏ రోజు మధ్యాహ్నంపూట చూచినా నదిఒడ్డున చాపలు పడుతూ కనబడతాడు. అందువల్ల సుభను ఎప్పుడూ కలసికోవటం తటస్థపడుతుండేది. ప్రతాప్ యేపనిచేస్తున్నా తోడు యెవరైనా వుండటం అవసరం. చాపలు పడుతున్నప్పుడు మాటాడకుండా వుండేవాళ్ళే వెంటవుండాలి. సుభ అలాంటి తోడు. ఆమె మౌనాన్ని ప్రతాప్ గౌరవించేవాడు. అందరూ ఆమెను సుభ అనిపిలిస్తే, అతడు ఇంకా ఆప్యాయతతో 'సు' అని పిలిచేవాడు. సుభ ఒక చింతచెట్టుక్రింద కూర్చొనివుండేది. ప్రతాప్ ఆమెకు కొద్దిదూరంలో కూర్చొని తనగేలం వేసేవాడు. ఇంటినుండి వచ్చేటప్పుడు ప్రతాప్ తమలపాకులు వక్కలు పట్టుకువచ్చేవాడు. సుభ వాటికిసున్నంరాచి ప్రతాప్‌కు ఇస్తూవుండేది. అలా అక్కడ మౌనంగా కూర్చొని చూస్తూవుంటే ప్రతాప్‌కు యేదోఒకవిధంగా సహాయపడాలనే కోర్కె జనించేది. తాను ప్రపంచానికి ఒక భారంకాదనీ, మానవమాత్రులకు యేదోవిధంగా సహాయపడగలనని ప్రకటించుకోవాలని ఆమెకు అనుపించేది. కాని అక్కడ ఆమెతో అయ్యేపనేమీ కనబడేదికాదు. అలాంటప్పుడు సుభ భగవంతుని

తలచుకొని "అమ్మో! మన 'సుభ' యింతపని చేయగలుగుతుందని నేను కలలోనైనా అనుకోలేదు" అని ప్రతాప్ ఆశ్చర్యపోయేటట్లు తాను ఏదైనా ఒక గొప్పపని చేయగలిగేందుకు యేదైనా ఒక గొప్పశక్తిని ప్రసాదించమని దేవుని ప్రార్థించేది.

సుభ తానొక నాగకన్యగా మారిపోయినట్లు భావించుకొనేది. ఆనదీగర్భంలోంచి దివ్యతేజస్సును వెదజల్లుతూ తాను పైకివస్తుంది. ప్రతాప్ ఆమెనుచూచి భ్రమసిపోయి నాగలోకంలోకి తన్ను వెంటాడుతాడు. నాగలోకంలోని ఆవైభవం మధ్య బంగారు తల్పంమీద వొయ్యారంగా పవళించియున్న నాగకన్యను చూస్తాడు. కాని ఆ నాగకన్యయెవరు? తనతో రోజూ నదిఒడ్డున కూర్చునే సుభయే ఆ నాగకన్య అని తెలుసుకొని ప్రతాప్ నివ్వెరపోడూ! తన కండ్లను తానే నమ్మగలుగుతాడా!—ఊఁహుఁ నమ్మడు. నమ్మలేడు. ఏదీ అసాధ్యమని కాదు. కాని ఆమె ఒక సామాన్య కుటుంబములో పుట్టింది. తనలాంటి దురదృష్టవంతురాలికి అటువంటి వైభవం పడుతుందని యెవరు నమ్మగలరు? తానేవిధంగా ప్రతాప్‌ను ఆశ్చర్యచకితుడ్ని చేయగలదు......

సుభలో యౌవనం ప్రవేశించసాగింది. ఏవేవో అవ్యక్తమైన భావాలు పొడసూపసాగినై. నిండుపౌర్ణమినాడు నడిసముద్రంలో కలిగే సంచలనంలాంటి సంచలనం ఆమె హృదయంలో కలుగజొచ్చింది. ఊహాలోకంలో తననుతానే చూచుకొని, తననుతానే ప్రశ్నించుకొనేది. కాని ఆమెకుఅర్థమయిన జవాబు యేదీ లభించేదికాదు.

నిండుచంద్రుడు ఆకాశంలో ప్రకాశిస్తున్న ఒకనాటి నడిరేయి సుభ లేచి నెమ్మదిగా తలుపుతీసి బయటికి తొంగి చూచింది. ఏకాకియైన సుభలాగే ప్రకృతి విరియబూసిన వెన్నెలలో నిద్రిస్తున్న ప్రపంచాన్ని చూస్తున్నది. ఆ దృశ్యం చూస్తూవుంటే సుభహృదయం కొట్టుకొనసాగింది. సంతోషమూ, విచారమూ హృదయంలోనిండుకొన్నాయి. ఇదివరకు కూడా ఆమె తన ఒంటరి జీవితాన్ని తలచుకొని బాధపడేది. కాని నేడు ఆమెకు తన ఒంటరిజీవితం మరీ భరించరానిదిగా తోచసాగింది. హృదయం భారంతో కృంగిపోతున్నది. అనంతమయిన ప్రకృతి ముందు క్షుభితహృదయంతో ఆ మూగపిల్ల అసహాయురాలై నిలచింది.

సుభ వివాహసమస్య ఆమె తలిదండ్రులను కలవరపెట్టసాగింది. ఇంకా ఆపిల్లకు వివాహంచేయనందుకు లోకులు తల్లిదండ్రులను నిందించసాగారు. చివరికి వాళ్ళను కులంనుంచి వెలివేయటానికిగూడా సంసిద్ధమయ్యారు. సుభతండ్రి ఒక విధంగా స్థితిపరుడే. తిండికి గుడ్డకి లోటులేనివాడు. అందువల్ల అతనికి గిట్టనివారు లేకపోవటమనేది ఉండదు. అమ్మలక్కలంతా తమకు వేరేమీ పనులులేనట్లు యీసంగతే మాట్లాడుకొనసాగారు. అటువంటి పరిస్థితులుచూచి సుభతండ్రి కొన్ని రోజులపాటు యెక్కడికో వెళ్ళిపోయాడు. తర్వాత కొన్ని రోజులకు తిరిగివచ్చి సుభతల్లితో "మనం కలకత్తాకు వెళ్ళాలి" అని అన్నాడు.

ఆ వింతప్రదేశానికి వెళ్ళటానికి తయారు కాజొచ్చారు. సుభహృదయం దుఃఖభారంతో బరువెక్కి పోయింది. కొద్ది

రోజులబట్టి తనను వెంటాడుతున్న యేదో అవ్యక్తమయిన భయంతో తల్లిదండ్రుల చర్యలను జాగ్రత్తగా గమనించ సాగింది. తన విశాలమైన నేత్రాలతో తల్లిదండ్రుల ముఖా లను సూక్ష్మంగా పరిశీలింపసాగింది. యేదైనావిషయం వాటిలో వ్యక్తమవుతుందేమోనన్న ఆశతో. కాని వారు ఆపిల్లకు ఒక విషయమైన తెలియనివ్వటంలేదు. పరిస్థితులు యీవిధంగా ఉన్న సమయంలో ఒకనాటి మధ్యాహ్నం ప్రతాప్ నదిఒడ్డున కనబడ్డాడు. చాపలు పట్టుకొంటున్న ప్రతాప్ సుభనుచూచి నవ్వుతూ యిలాఅన్నాడు– "అయితే సుభా! మీవాళ్ళు యెట్లాగైతేనేం నీకు భర్తను సంపాదించుకొచ్చారన్నమాట. పెండ్లి తొందరలోనే అయిపోతుంది. కాని నన్నుమాత్రం మరచిపోకేం?" తర్వాత అతడు యేమీ జరుగనట్లే నదివైపు తిరిగి చేపలు పట్టుకొనసాగాడు. "నేను నీకేం హాని కలుగ జేశాను?" అని వేటకాని ముఖంలోకి జాలిగాచూచే పక్షి లాగ సుభ ప్రతాప్‌వైపు చూచింది. కాని రోజులాగ ఎక్కువ సేపు అక్కడ కూర్చొనలేదు. సుభతండ్రి అప్పుడే మధ్యా హ్నపు నిద్రనుండిలేచి చుట్ట కాల్చుకొంటున్నాడు. పరుగు పరుగున వెళ్ళి సుభ తండ్రికాళ్ళముందు కుప్పగా కూలిపోయి అతని ముఖంలోకి చూస్తూ వెక్కి వెక్కి యేడ్వనారంభించింది. తండ్రి ఆమెను ఓదార్చబోయాడు. కాని అతని కళ్ళుగూడా చెమ్మగిల్లాయి.

మర్నాడు కలకత్తాకు బయలుదేరాలని నిర్ణయించు కున్నారు. సుభ తన స్నేహితులదగ్గర సెలవు తీసుకొనేందుకు పశువులకొట్టంలోకి వెళ్ళింది. గంగు, లక్ష్మిలకు తనచేతితో

గట్టిగా కౌగిలించుకొంది. వాటిని కావలించుకొని, వాటిముఖాల్లోకి జాలిగా చూచింది. హృదయ వేదనను వ్యక్తపరుస్తూ కండ్ల వెంట నీళ్ళు జలజల రాలాయి

దశమి చంద్రుడు ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు సుభ నిశ్శబ్దంగా తనగదిని విడిచి నదిఒడ్డుకు చేరుకున్నది. తను రోజూ కూర్చొనే స్థలానికి వెళ్ళి బోర్ల పడుకొని భూమాతను కౌగిలించుకొన్నది. "తల్లీ నన్ను వదలివేయవద్దు. నేను నిన్ను కౌగలించుకొన్నట్లుగానే నీపవిత్రమైన హస్తాలతో నన్ను కౌగలించుకొని గట్టిగా పట్టుకో. నన్ను వదలివేయవద్దు తల్లీ" అని మూగభాషలోనే యేడ్చింది.

ఒకనాడు కలకత్తాలోని ఒకయింట్లో సుభతల్లి ఆమెను జాగ్రత్తగా అలంకరించింది. తల చక్కగా దువ్వి రిబ్బన్లు కట్టింది వంటినిండా నగలు తగిలించింది. సుభయొక్క సహజ సౌందర్యాన్ని అంతమొందించేందుకు తన శక్తినంతా వినియోగించింది. కాని శుభకండ్లనుంచి అశ్రువులు రాలుతున్నాయి. అలా యేడుస్తూ ఉన్నట్లయితే కండ్లు ఉబ్బిపోతాయన్న భయంతో తల్లి సుభను కఠినంగా తిట్టింది. ఆ తిట్లుగూడా ఆమెకన్నీళ్ళను ఆపలేకపోయాయి. పెండ్లికుమారుడు పెండ్లికూతురును చూడటానికి ఒక స్నేహితుడితో సహా వచ్చాడు. తనకు బలి కావింపబడబోయే జంతువును పరీక్షించుకోటానికి వచ్చిన ఆ దేవుడిని చూడగానే సుభ తలిదండ్రులకు ఆదుర్దా యెక్కువైంది. తత్తరపాటును పొందసాగారు. పెండ్లికొడుకు సమక్షంలో పంపేముందు తల్లి సుభకు యెన్నో ఉపదేశాలు చేసి, వాటిని మరిచిపోవద్దని గద్దించింది. సుభకు ఆమాటలు

వింటూంటే దుఃఖం ద్విగుణీకృతమయింది. పెండ్లికొడుకు సుభను యగాదిగా చాలాసేపు పరిశీలించి– "పరవాలేదు. నచ్చి నట్లే"–అని తనఅమూల్యాభిప్రాయాన్ని ప్రకటించాడు.

పెండ్లికొడుకు సుభకండ్లలోని నీళ్ళుగమనించి ఆమె చాలా మెత్తనిహృదయం గలదనీ, అందువల్లనే తల్లిదండ్రుల వియోగాన్ని భరించలేక కంట తడిపెట్టుకుంటున్నదని అనుకున్నాడు. నేడు తల్లిదండ్రులను విడవటానికి యింతబాధ పడుతున్న యీ బాలిక తననుకూడా హృదయపూర్వకంగా ప్రేమించగలదని నిర్ణయించుకున్నాడు, పెండ్లికొడుకు. ఆ విధంగా పెండ్లికొడుకు దృష్టిలో సుభవిలువ యింకా పెరిగింది. అంతేగాని అసలు సుభ యెందుకు కన్నీళ్ళురాలుస్తోందో అతని ఊహాకందలేదు.

ఒక శుభముహూర్తం నిశ్చయించి పెండ్లిచేసేశారు. తమ మూగబాలికను ఇంకొకరి చేతిలోపెట్టి తమభారం తగ్గిపోయినట్లుగా భావించుకొని సుభతల్లిదండ్రులు ఇంటికి చేరుకున్నారు. భగవంతుడు మేలుచేసి, తాము కులభ్రష్టులు కాకుండా దక్కిపోయామని అనుకున్నారు. పెండ్లికొడుకు దూరాన యెక్కడో ఉద్యోగంచేస్తున్నాడు. పెండ్లయిన కొద్దిరోజులకే సుభను అక్కడికి తీసుకొనిపోయాడు.

పెండ్లికూతురు మూగదన్నవిషయం పదిరోజులలోనే అందరికీ తెలిసిపోయింది. ఎవరికైనా ఆ విషయం ముందుగా తెలియలేదంటే ఆ తప్పు సుభదిమాత్రంకాదు. ఆమె యెవ్వరినీ

మోసంచేయ్యలేదు. ఆమెకళ్లు అన్నివిషయాలను బిగ్గరగా చెపుతూనే వచ్చాయి. కాని యెవ్వరూ అది గ్రహించారే కాదు.

కొత్త వాతావరణంలో ఆమె అందరిముఖాలు వెతికింది. కాని ఆమె భాషను అర్థంచేసుకొనేవారుగాని, మాట్లాడేవారు కాని కనబడలేదు. ఆమె హృదయం పైకివినబడని దుఃఖాన్ని అనుభవిస్తున్నది. హృదయాలను తెరిచిచూడగల సమర్థులకు గాని ఆదుఃఖం వినబడదు. ఆమె విచారం అర్థంకాదు.

---

# అనుమానం

గారాబంగా పెరిగిన శ్రీమంతుల బిడ్డ గౌరి. ఆమె భర్త పరేశుడు యీమధ్యనే తన చెడిన స్థితిగతులనుంచి పుంజుకున్నాడు. అతడిస్థితి చితికివున్నంతకాలం గౌరి తలిదండ్రులు ఆమెను కాపురానికి పంపి కష్టాలలో దింపను యిష్టపడక తమదగ్గరే వుంచుకున్నారు. అందువల్ల ఆమెకు బాగా యీడు పైబడిన తర్వాతే భర్తతో జీవనం ప్రారంభమైనది. ఈ విధంగా గౌరీ పరేశులు కలిసి కాపురం చేస్తున్నప్పటికీ వారిలో సన్నిహితత్వం మాత్రం యేర్పడలేదు. వారి బాంధవ్యం అతుకుపెట్టినట్టుగానే వుంటూవచ్చింది.

పరేశుడు వొక చిన్న పట్టణంలో న్యాయవాదిగా వుంటున్నాడు. అతనికి దగ్గరబంధువు లెవ్వరూ లేరు. తాను పనిమీద వెళ్ళినప్పుడు భార్య ఒంటరిగా వుండటం ఆతడికి నచ్చేదికాదు. ఆ విషయమై యెప్పుడూ అతని మనస్సు మథన పడుతుండేది హఠాత్తుగా యింటికి తిరిగి వచ్చేస్తుండేవాడు. తల వనితలంపుగా అట్లా యెందుకువచ్చేస్తుండేవాడో మొదటిరోజులలో గౌరికి అర్థమయిందికాదు. ఒకొక్కసారి కారణంచెప్పకుండానే యింట్లో పనిచేసే సేవకుణ్ణి పనిలోనుంచి తొలగిస్తుండేవాడు. అతనికి యేసేవకుడుగూడా నచ్చేవాడుకాడు. ముఖ్యంగా గౌరి యే సేవకుడినైతే నమ్మకస్తుడని మెచ్చుకుంటుందో వాడికి మర్నాడే ఉద్వాసన యిప్పించేవాడు. ఆత్మాభిమానం గల గౌరికి యివన్నీ కోపాన్ని తెప్పిస్తుండేవి. కాని ఆ కోపం

పరేశుని ప్రవర్తనకు మరీ వెఱ్ఱితలలు వేయటానికి కారణమౌతుండేది.

పోనుపోను పరేశుని ఆందోళన యింకా యెక్కువయింది. రహస్యంగా యింటినుంచి గౌరి ప్రవర్తనవిషయమై ఆరా తీయసాగాడు. ఆ సంగతి గౌరి చెవినికూడా పడింది. అది తెలుసుకొని పరేశుడు—తనలోని మృదుత్వం మొదలంటా తెగనరికి—గౌరిని ముఖంమీద కొట్టినట్టుగా నిష్కర్షగా మాట్లాడసాగాడు. ఈ అవమానాలు గౌరిలోని అహాన్ని మిన్నుముట్టించినవి. కాని ఆమె సహజంగా మితభాషిణి. భర్తకు బదులాడకుండా అవన్నీ సహిస్తున్నది. ఆమె ఆవిధంగా మారుపలుకకపోవటంతో పరేశుని అనుమానం మరీ బలపడ్డది. ఈర్ష్య హృదయాన్ని దహించివేయసాగింది.

ఈ విధంగా సంసారసౌఖ్యానికి నోచుకోని గౌరికి బిడ్డాపాపావున్నా కొంత దుఃఖోపశమనం కలిగివుండేది. ఆ భాగ్యంకూడా కలుగలేదు. చివరికి మనశ్శాంతి చేకూరటానికి చిత్తము దైవచింతనంలోకి త్రిప్పింది. అక్కడికి దాపులో వున్న పరమానందస్వాములవార్ని గురువుగా స్వీకరించింది. అతనిని యింటికి పిలిపించి, అతడు భగవద్గీతాపారాయణ చేస్తుండగా వింటూ కాలం గడుపుతుండేది. సాంసారిక జీవనంలో తావు దొరకని ఆమె ప్రేమ, అధ్యాత్మిక చింతలో గురుభక్తిరూపం దాల్చి పరమానందస్వామివారి పాదాలముందు వెల్లువలయి ప్రవహించింది.

తన భార్య పరమానందస్వామి సేవచేయుటంకూడా పరేశుడు అనుమాన దృష్టితో చూడక మానలేదు. కాని

పరమానందస్వామివారి నమ్రతను శంకించినవారెవ్వరూ లేరు. అందరూ పూజ్యభావంతో నమస్కరించేవారు. అందువల్ల స్వామి మీద నింద వెయ్యటానికి పరేశునికి ధైర్యం చాలలేదు. కాని అనుమానం అతని హృదయంలో చేరి దొలిచివేయసాగింది.

ఒకనాడేదో స్వల్పవిషయంలో గౌరి పరేశులు కీచులాడారు. ఆ అవకాశం తీసుకుని పరేశుడు తనలోని విషాన్నంతా వెళ్ళగక్కాడు. అణుచుకోలేని క్రోధంతో పరమానందుని నోటికి వచ్చినట్లు గౌరిముందు దుర్భాషలాడాడు. "భక్తుడు కాదు, వంచకుడు...నిజంచెప్పు, నువ్వువాణ్ణి ప్రేమించటం లేదూ?" అన్నాడు.

ఈ మాటలు విని గౌరి తోకత్రొక్కిన త్రాచులా లేచింది, ఆమెలోని అహం పైకి తలయెత్తింది. వెటకారంగా "ఐతే ఏంకేం?" అని భర్తకు జవాబిచ్చింది.

ఈ సంఘటన జరిగిన వెంటనే పరేశుడు గౌరిని యింట్లో పెట్టి గొళ్ళెంవేసి తన పనిమీద వెళ్ళిపోయాడు...గౌరికూడా వెనుకంజ వేయలేదు. క్రోధం ఆవహించి ఆమె కండ్లను మూసివేసింది. అహం ముందికి తోసింది. ఏదోవుపాయంతో తలుపు తీసుకుని యిల్లువిడిచి వెళ్ళిపోయింది.

పరమానందస్వామి ప్రశాంతంగా కూర్చుని యేకాగ్రతతో వేదాధ్యయనం చేస్తున్నాడు. హఠాత్తుగా గౌరి అతని కండ్లముందు నిలిచింది.

"నీవు!...ఇక్కడ?" — ఆశ్చర్యంతో ప్రశ్నించాడు గురువు.

"గురువర్యా, నన్ను రక్షించండి. ఈ అవమానాలు నేను సహించలేను. సంసారసాగరంనుంచి నన్ను దరిజేర్చి, మీ పాదసేవచేయు భాగ్యం కలిగించండి" అన్నదామె.

అంతా గ్రహించి పరమానందస్వామి, గౌరిని గట్టిగా మందలించి యింటికి పంపివేశాడు. కాని మళ్ళీ అతని మనస్సు గ్రంథపఠనంమీద లగ్నం కాలేకపోయింది.

పరేశుడు యింటికి తిరిగివచ్చి తలుపు తీసివుండటం చూచాడు. "ఇక్కడికి యెవరువచ్చారు?" అని గౌరిని నొక్కి అడిగాడు.

"ఎవ్వరూ రాలేదు, నేనే మా గురువుదగ్గరకు వెళ్ళి వచ్చాను" అని గంభీరంగా జవాబిచ్చింది.

పరేశుడు వెలవెలబోతూ, "ఎందుకు?" అన్నాడు.

"నాకు వెళ్ళాలని బుద్ధిపుట్టింది గాబట్టి"—అన్న గౌరి జవాబుతో అతడు ఉగ్రుడైపోయాడు.

మర్నాటినుంచీ పరేశుడు తన భార్యదగ్గర వొక ఆడ మనిషిని యెప్పుడూ కాపలావుంచుతూ నిర్బంధంలో వుంచ సాగాడు. ఈ వింత ప్రవర్తన ఊరందరికీ తెలిసి హాస్యంగా చెప్పుకోసాగారు.

తనమూలంగా దినదినం శిష్యురాలిమీద అధికమౌ తున్న అపవాదులు పరమానందస్వామివారి మనస్సును వికల పరచినవి. తక్షణం ఆవూరువిడిచి వెళ్ళిపోవాలనుకున్నాడు. కాని ఆవిధంగా చిత్రవధ గావింపబడుతున్న అబలను విడిచి వెళ్ళటా నికికూడ అతనికి మనసు వొప్పలేదు. సర్వమూ త్యజించిన ఆ

తపస్వీమనసు గూడా గౌరివిషయమై నరకబాధ అనుభ
వించింది.

చివరికి వొకనాడు గౌరికి గురువుగారి దగ్గరనుంచి వొక ఉత్తరం వచ్చింది—"బిడ్డా, యెందరో ఉత్తమస్త్రీలు యీ సంసారబంధాలు తెంచుకుని ప్రభుసేవకై తమజీవితాలు అంకితం చేశారు. సంసారంలోని యీ పరీక్షలు నీచిత్తాన్నిగూడా ఆ వైపుకి తోలుతున్నట్టయితే ప్రభుకటాక్షంతో నిన్ను తప్పక గాపాడి ప్రభుపాదసేవకు అర్పిస్తాను. నీకది అంగీకారమైతే రేపు మధ్యాహ్నం రెండుగంటలకు మాతోటలో నన్ను కలిసి కోవలసినది" అని ఆ ఉత్తరంలో వున్నది.

గౌరి భక్తితో ఆ ఉత్తరం తన దీర్ఘకేశాల్లో దాచుకున్నది. మర్నాడు స్నానం చేసేముందు తల విప్పుకుని చూడగా ఉత్తరం అగుపడలేదు. ఆ ఉత్తరం నిద్రపోతున్నప్పుడు ప్రక్కమీద పడిపోయి భర్తకు దొరికిందేమోనని గాబరాపడ్డది. మొట్టమొదట ఆఉత్తరం పరేశుని మరీకవ్వించి యేడ్పిస్తుందికదా అని పిచ్చిఆనందం పొందింది. కాని మరుక్షణం అలాంటి పవిత్రమైన వస్తువు నీచుడగు పరేశుని హస్తగతమై అపవిత్రపడటమంటే సహించలేకపోయింది.

చరచరా భర్తవున్నగదికి వెళ్ళింది. అతడుమూల్గుతూ నేలమీద పడివున్నాడు. నోటివెంట నురుగులు వస్తున్నవి. కెల్లగుడ్లుపడినవి. బిగిసివున్న పిడికిటిలో ఉత్తరం కనిపించింది. గౌరి ఉత్తరం తీసుకొని తక్షణం వైద్యునికోసం కబురంపింది.

వైద్యుడువచ్చి పరీక్షచేశాడు. నిరుత్సాహంతో పరే శునికి కలిగినది పక్షవాత సంబంధమైన జబ్బుఅనీ, తాను రాక ముందే అసువులు విడిచాడనీ తెలియజేశాడు.

అదేరోజు పరేశుడు ఏదోపనిమీదగ్రామాంతరం వెళ్ళ వలసివున్నది. అది తెలుసుకునే పరమానందస్వామి గౌరిని నాడు వారితోటలో పారిపోవటానికిగాను మధ్యాహ్నం కలిసికో మన్నాడు. ఆహా! తోటిమానవ తప్తహృదయాన్ని కాపాడను విరాగికూడా యెంతటి అల్పమార్గానికి పాల్పడవలసివచ్చినది!!

ఈ స్థితిలో కిటికీలోంచి గౌరికళ్ళకి తన గురువు దొంగ లాగ పొంచిపొంచి తోటలోకి వస్తుండటం కనుపించింది. ఆమె అది చూడలేక చూపుక్రిందికి దింపివేసింది. తనకోసం గురువు యే స్థితికి దిగవలసి వచ్చినదో గ్రహించింది.

"గౌరీ" అని గురువు పిలిచాడు.

"వస్తున్నాను, స్వామీ"– అని జవాబు చెప్పింది.

కాని తర్వాత కనుపించింది గౌరి కళేబరం మాత్రమే. ఆమీద గౌరీపరేశుల చావుసంగతి విని చూడవచ్చినవారు– "ఆహా! యెంతటి సతీత్వము" అని గౌరి విషయమై గొప్పగా చెప్పుకున్నారు.

లోకనింద భరింప భయపడి ఆమె ఆవిధంగా విషసాధ నంతో ప్రపంచం కళ్ళముందునుంచి తొలగిపోయిందని యెవరికి తెలుస్తుంది!

—0—

# నదిమెట్టు

కాలగర్భంలో మరుగుపడ్డ కథలు విన కుతూహలం వుంటే నా నదిమెట్లమీద కూర్చుని నే చెప్పేవి సావకాశంగా వినండి.

శ్రావణ మాసాంతం. నది నిండుచూలాలివిధంగా వున్నది. నామెట్లు నాల్గుమాత్రం నీటిపైకి కనబడుతుండేవి. నీటి అంచులలో తుంగ దట్టంగా పెరిగింది. నది ఒడ్డున వున్న మొక్కలు అప్పుడే మొగ్గలు తొడుగుతున్నవి. అరుణకాంతుల్లో ఆనందంతో తలలూపసాగినవి.

బ్రాహ్మణులు స్నాన సంధ్యాదులకై వస్తున్నారు. ఇద్దరుముగ్గురుగా కలసి స్త్రీలు బిందెలతో నీలాటిరేవుకి చేరుకుంటున్నారు. ఇదే సమయంలో కుసుమకూడా నీటికోసం వస్తుందని నాకు తెలుసు.

కాని ఆదినం ఆమె రాలేదు. భువన స్వర్ణలను ఆమె చెలికత్తెలు ఆమె విషయమై విచారపడుతున్నారు. కుసుమ తమ్మి విడిచి సరికొత్తమనుష్యుల మధ్యకి- అత్తవారింటికి వెళ్ళిపోయిందని చెప్పుకున్నారు.

కొంతకాలానికి ఆమె విషయం నేను మరచేపోయాను. సంవత్సరం గడిచింది. నీలాటిరేవులో అమ్మలక్కలు కుసుమను గురించి ప్రసంగం చేయటమే మానుకున్నారు. ఒకనాటి సాయంకాలం పరిచితమైన పాదద్వయం నాకు తగిలి ఉలిక్కి-

పడి చూచుకున్నాను. అవును! పరిచితమైనవే! కాని పూర్వం వలె ఆ కాళ్ళకు కడియాలు కాని మట్టెలుకాని లేవు.

కుసుమ తలచెడి తిరిగివచ్చింది. ఆమె భర్త ఏదో దూర దేశంలో పనిచేస్తున్నాడనీ, కుసుమకు అతణ్ణి చూచేభాగ్యం ఒకటి రెండుసార్లకన్నా యెక్కువ కలుగలేదనీ, చెప్పుకుంటు న్నారు. అతని మరణాన్ని తెలుపుతూ ఉత్తరం ఒకటి కొంత కాలానికి వచ్చిందట పాపం! ఎనిమిదవ ఏటనే వితంతువని పించుకున్నది. కళాకాంతులనిచ్చే కుంకుమ, గాజులు మొదలైన వాటికి ఆమెకు అర్హతలేదని తీసివేశారు. తిరిగి తన పుట్టింటికి చేరుకున్నది. ఆమె బాల్యస్నేహితురాండ్రు వివాహితులై అత్తవారిళ్ళకు వెళ్ళిపోయారు. ఒక్క శరత్ అను బాలిక మాత్రం మిగిలింది. ఆమెకుకూడా కొన్నిరోజులలో వివాహం కానున్నది.

వర్షఋతువు ఆగమనంతో నదులు నిండే విధంగా కాల క్రమాన కుసుమలో యౌవనోదయం కలిగి సౌందర్యం వృద్ధి కాజొచ్చింది. ఆమె మలిన వస్త్రాలు, చింతాక్రాంతవదనము పురుషుల కంటికి మంచు తెరవిధంగా అడ్డుపడి ఆమె యౌవ నాన్ని మరుగుపరచింది. ఇట్లే పది సంవత్సరాలు దాటిపోయి నప్పటికీ కుసుమ యౌవనవతి అయిందన్న విషయం యెవ్వరూ గుర్తించినట్లులేదు.

ఒకనాటి ఉదయాన ఎక్కడినుండి వచ్చాడో ఒక యువక సన్యాసి వచ్చి నాముందున్న శివాలయంలో ఆశ్రయం తీసుకున్నాడు. అతని రాక గ్రామమంతటా ప్రాకిపోయింది.

నదికి వచ్చిన ఆడంగులంతా అతని దర్శనం చేసుకోటానికి గుంపులు గుంపులుగా వెళ్ళసాగారు.

అతనిని చూడటానికి వచ్చే ప్రజలు రోజురోజుకీ ఎక్కువ కాసాగారు. ముఖ్యంగా స్త్రీజనం అతనిని గురించి యెక్కువగా చెప్పుకోసాగారు. ఒక్కొక్కప్పుడు పురాణ కాలక్షేపమూ, మరొకప్పుడు భగవద్గీతాపారాయణం చేస్తుండేవాడు అందరూ ధర్మచింతాపరులై అతనిని ఆశ్రయిస్తుండేవారు.

ఈ విధంగా కొన్ని నెలలు గడిచినవి. ఒకసారి సూర్య గ్రహణంనాడు స్నానాలకై ప్రజలు నదికి తండోపతండాలుగా వచ్చారు. వారంతా సన్యాసిని చూడటానికికూడా వెళ్ళారు. అందులో కుసుమ అత్తవారి గ్రామంనుంచి వచ్చినవారు కూడా కొందరున్నారు.

ఒకనాటిప్రభాతంలో, సన్యాసి నామెట్లమీద తావళం తిప్పుకుంటూ ధ్యానంలోనున్నాడు. వచ్చినవారిలో ఒకావిడ తనప్రక్కావిడకు సైగచేసి "అదిగోనే! కుసుమభర్త" అని సన్యాసిని చూపించింది. మరొకావిడ "ఏమిటె! మన గ్రామం చట జలవారబ్బాయేనా!" అని ఆశ్చర్యపడ్డది. అందరూ కలసి "అచ్చం అదేముక్కు, అదేకళ్ళు, అతడేనేమో నసుకోసాగారు. చివరికి ఒకావిడ "ఆ కుర్రాడెప్పుడోపోయాడు... పాపం! కుసుమకంత భాగ్యంకూడానా" అని తక్కినవారి భ్రమలన్నీ కొట్టివేసింది. అంతటితో ఆ ప్రసంగం ఆగి పోయింది.

నిండు చంద్రుడుదయిస్తుండగా ఒకనాటి సంధ్యవేళ కుసుమవచ్చి నామెట్లమీద కూర్చున్నది. అప్పుడు రేవులో మరెవ్వరూలేరు. చింతగిలియలు శబ్దంచేస్తున్నవి. చంద్రకాంతిలో నదినీళ్ళు తళతళ లాడుతున్నవి. గబ్బిలాలు అటూ యిటూ ఎగరజొచ్చినవి. ఎక్కడినుంచో నక్కలకూత కొంత సేపు వినిపించి తర్వాత ఆగిపోయింది.

సన్యాసి అప్పుడే ఆలయంనుంచి బయటికి వస్తున్నాడు. కొన్ని నదిమెట్లు దిగి, యెవరో స్త్రీ ఏకాంతంగా వుండటం చూచి వెళ్ళిపోబోయాడు. అంతలో కుసుమ తిరిగి చూడగా ఆమె ముసుగు తొలగిపోయింది. వెన్నెల ఆమెముఖంమీదపడి ప్రకాశవంతం చేసింది. ఒక గుడ్లగూబ శబ్దం చేసుకుంటూ వాళ్ళతలమీదుగుండా యెగిరిపోయింది. ఆ సవ్వడికి కుసుమ తేరుకుని తలమీదకి ముసుగు మళ్ళీ లాక్కున్నది. తర్వాత సన్యాసి పాదాలకు నమస్కారం చేసింది. అతడు దీవించి "నీ వెవ్వరవు?" అని అడిగాడు. నన్ను "కుసుమ అంటారు" అని జవాబిచ్చింది.

ఆరాత్రి మరేమి సంభాషణ జరగలేదు. కుసుమ యింటికి మరలింది. కాని సన్యాసి ఆమెట్లమీద ఆరాత్రి యెంతో కాలం వుండిపోయాడు. అర్ధరాత్రి మించినతర్వాత లేచి ఆలయంలోకి వెళ్ళాడు.

అదిమొదలు కుసుమ రోజూ సన్యాసిపాదాలకు నమస్కారం చేయటానికి వస్తుండేది. పురాణకాలక్షేపాల్లో ఒక మూల నిల్చుని వింటుండేది. ప్రొద్దుటి పూజాపునస్కారాలైపోవటంతోనే సన్యాసి ఆమెకు ధర్మబోధ చేస్తుండేవాడు.

ఆమెకు అవి అర్థంకానప్పటికీ అర్థంచేసుకోటానికి ప్రయత్నిస్తూ నిశ్చలంగా నిల్చునేది. అతడు చెప్పినదంతా మారుమాటాడక ఆచరిస్తుండేది. ప్రతిరోజూ పూజకై పూలు తెస్తూ, నదినుంచి నీళ్ళు తెచ్చి దేవాలయం శుద్ధిపరుస్తూ, సన్యాసికి దైవార్చనలో తోడుపడుతుండేది.

వసంతఋతువు ప్రారంభమయింది. అంతా శోభాయమానంగా వున్నది. ఆనంద తరంగాలలో నోలలాడే ప్రజల మంగళ ధ్వనులు గ్రామంనుంచి వినుపిస్తుండేవి. పల్లెకారులు గోపికా గీతాలు పాడుకుంటుండేవారు......ఈ సమయంలో కుసుమ నాకు కనబడటం మళ్ళీమానింది. దైవార్చనకు గాని సన్యాసిని చూడటానికిగాని, చివరకు నీలాటిరేవుకుకూడా రావడం మానుకున్నది.

తర్వాత ఏమి జరిగిందో నాకు తెలియదు. కానికొంత కాలానికి మళ్ళీ ఒక సాయంకాలం వారిద్దరూ నామెట్లమీద కలుసుకున్నారు. చిన్నబోయిన ముఖంతో కుసుమ "స్వామీ నన్ను పిలిచారా?" అని అడిగింది. "అవును-రావటం మాను కున్నావేమి? దైవార్చనలో అంతనిర్లక్ష్యం యెందుకు కలిగింది?" అన్నాడు.

ఆమె మౌనం వహించింది.

"దాపరికం లేకుండా నీ మనస్సులో యేమున్నదో చెప్పు"

ఆమె అతని చూపులనుండి తప్పించుకోడానికి ప్రయత్నంచేస్తూ, "నేను పాపిని అందువల్ల దైవార్చనకు తగను

స్వామీ" అన్నది. అందుకు సన్యాసి "నీహృదయంలో తుఫాను చెలరేగిందని నేనెరుగుదును, కుసుమ్ అన్నాడు.

ఆమె కొద్దిగా జడిసింది. ముసుగు పూర్తిగా లాక్కుని మెట్లమీద అతని కాళ్ళముందు కూర్చుని యేడ్వసాగింది. అతడు కొద్దిగా ప్రక్కకు తొలగి "నీ హృదయం విప్పి అంతా చెప్పు...శాంతిలభించే విధం చెబుతాను" అన్నాడు.

గద్గదస్వరంతో ఆమె చెప్ప నారంభించింది. "మీ ఆజ్ఞ వినతర్వాత నేను చెప్పకతప్పదు...కాని మీకు బోధపర్చడం నావశంకాదు స్వామీ! మీకంతా తెలిసేవుంటుంది. నేను ఒకర్ని దేవుడుగా భావించుకున్నాను – పూజచేశాను. పరమానందంతో నాహృదయం విప్పారింది. కాని ఒకనాడు నా హృదయ దేవత ఒక సుందరవనం మధ్య కూర్చుని నా కరగ్రహణం కావించి చెవిలో ప్రేమరహస్యాలు బోధిస్తున్నట్లుగా కలగన్నాను. ఆ కల నాకేమంత వింతగా కనబడలేదు. ఆకలు యెప్పుడో పోయినప్పటికీ ఇంకానన్ను ఆ తలంపు వీడలేదు. మర్నాడు నాస్వామిని చూడగా క్రొత్తగా కనబడ్డాడు. కలలో అంకురించిన భావం నన్ను వీడకుండా వేధిస్తున్నది. నాస్వామి నుండి దూరంగా వుండటానికి ప్రయత్నించాను. కాని లాభం లేకపోయింది. అప్పటినుంచి నా హృదయంలో తుఫాను చెలరేగింది. అంతా చీకటిమయంగానున్నది!"

కన్నీరు తుడుచుకుంటూ ఆమె యీగాధ చెప్పుతున్నంతసేపూ మౌనంతో తన కుడిపాదంతో నామెట్లను గట్టిగా వత్తసాగాడు.

ఆమె ముగించింది. సన్యాసి గంభీరంగా అడిగాడు.

"నీకలలో కనబడ్డవ్యక్తి ఎవరు"

"స్వామీ నేను చెప్పలేను"

"చెప్పక తప్పదు" అని సన్యాసి నొక్కి అడిగాడు.

"చెప్పక తప్పదా?" "చెప్పితీరాలి"

"ఆ పురుషులు మీరేస్వామీ" అని ఒక్కసారిగా కుసుమ వెక్కి వెక్కి యేడ్వనారంభించింది.

కొంతతడవాగి సన్యాసి అన్నాడు. "నేనీరాత్రికి ఈ స్థలం విడిచి పోతున్నాను. నేను సన్యాసినన్న మాట నీకు తెలుసు. నన్ను నీవు మరచిపోవాలి."

కుసుమ సరేనన్నట్టు తలఊపింది. "సెలవు తీసుకుంటాను." అన్నాడు సన్యాసి. కుసుమ అతనికి నమస్కారంచేసి అతని పాదధూళి తన శిరంమీద నుంచుకున్నది. సన్యాసి వెళ్ళిపోయాడు.

చంద్రుడు అస్తమించాడు. చీకటి నలుదిశలనుండి ఆవరించింది. నీటిలో బరువైనవస్తువేదో పడ్డశబ్దం వినుపించింది. ఆకాశంలోని నక్షత్రాలను తుడిచివేయాలన్నట్టు ఒక్కపెట్టున తీవ్రంగా గాలి వీచింది.

---

# నాటిరేయి

సుశీల నేను జతగా బడికి వెళ్ళేవాళ్ళం. జతగా ఆడు కునేవాళ్ళం అప్పుడప్పుడు వాళ్ళ యింటికికూడా వెళ్ళుతుండే వాడ్ని. ఆమెతల్లి నన్ను ప్రేమతో తనకూతురుపక్క నిల బెట్టి "ఎంతచక్కనిజోడి!" అని ఆనందపడుతుండేది.

అప్పటికి నేను పసివాడ్నే. అయినా ఆమాటల అర్థం గ్రాహ్యమయ్యేది. అప్పటినుంచి సుశీలమీద నాకు ప్రత్యేక అధికారం ఉన్నదను భావం నాలో ఏర్పడ్డది. ఆ అహంభా వంతో ఆమెనెప్పుడూ యేడ్పిస్తుండేవాడ్ని. నోరు మెదప కుండా ఆమె అవన్నీ భరిస్తుండేది. ఆమె అందాన్ని అందరూ శ్లాఘిస్తుండేవారు. కాని నాలాంటి ముష్కరుడికి దానిలో విలువ కనపడేదికాదు. నాలో ఒక్కటే గర్వం-సుశీల తన తండ్రియింట కేవలం నా యిష్టాయిష్టాలకోసం పుట్టిందనీ, అందువల్ల నేను గౌరవింప తగ్గదికాదనీ.

మా నాన్న జమీందార్ల దివాణంలో కొలువు చేస్తుం డేవాడు. నేను వ్రాతకోతలు నేర్వగానే నన్ను దివాణంలో వద్దైనా ఉద్యోగంలో పెట్టెయ్యాలని మానాన్న ఉద్దేశ్యం. కాని నాకు యిష్టంలేదు. మావూరి నీలరత్నం చిన్నప్పుడు కలకత్తాలో ఇంగ్లీషు చదువుకొని, కోర్టులో పెద్ద ఉద్యోగి అయ్యాడు. నా ఆశయం అదే. చివరికి జడ్జికోర్టులో "హెడ్ క్లర్కు" నన్నా కావాలని నా పట్టుదల.

ఉద్యోగస్థులంటే ఎంత గౌరవం! భారతీయులకు గల ముప్పైమూడుకోట్ల దేవతలకు కొత్తగవర్నర్నికూడా చేర్చి పూజిస్తుంటారు. కార్యసిద్ధికోసం మునుపు విఘ్నేశ్వరపూజ చేసినట్టే యిప్పుడు ఉద్యోగస్థులపూజ చేసుకుంటారు. కూర గాయలతోసహా వారిఖర్చు లేకుండా యింటికొచ్చి పడుతుం టాయి. అందువల్ల చివరికి జడ్జికోర్టులో "హెడ్‌క్లర్కు" వన్నా కావాలని పట్టుదల.

నా ఆశయసిద్ధికోసం మంచి అవకాశం చూచుకొని ఒకనాడు ఎవ్వరికీ చెప్పకుండా కలకత్తా ప్రయాణం కట్టేశాను. అక్కడ ఉన్నానని తెలిశాక మానాన్న కిక్కురుమనకుండా డబ్బు పంపసాగాడు. అక్కడ యింగ్లీషు చదువు ప్రారం భించాను.

కలకత్తా జీవితంలో కొంతకాలానికి నాకు యింకొక మోజు కలిగింది. రాజకీయాలు నన్ను ఆకర్షించినాయి. ఏమైనాసరే నాజీవితం దేశసౌభాగ్యంకోసం అంకితం చేయా లనుకున్నాను. అందులోనున్న సాధకబాధకాలు నాకు తెలి యవు, యెవ్వరూ చెప్పనుకూడాలేదు.

ఉత్సాహంతో పనిచేయసాగాను. మా పల్లెటూరి పిల్లలదంతా వింతపద్ధతి. కలకత్తా పిల్లలవిధంగా ప్రతిదానిని చూచి హేళన చెయ్యడమంటే మాకు అసహ్యం. మానాయ కులు చెప్పినవన్నీ శ్రద్ధగావినేవాళ్ళం. మండుటెండల్లోకూడా, తిండీతిప్పలు లేకుండా యింటింటికీ తిరిగి దేశసేవకు చందాలు వసూలుచేసేవాళ్ళం. రోడ్లవెంట కరపత్రాలు పంచిపెట్టే వాళ్ళం, ఉపన్యాసాలకి నాయకులు వచ్చేలోపల అన్నీ సిద్ధ

పరచి ఉంచేవాళ్ళం. ఎవరైనా మా నాయకులను నిరసించి మాట్లాడితే సహించక వాడితో కయ్యానికి దిగేవాళ్ళం. ఇదంతా కలకత్తాపిల్లలకు హాస్యాస్పదంగా కనపడేది. ఉద్యోగస్థుణ్ని కావాలని బయలుదేరిన నేను చివరికి దేశోద్ధారకుణ్ణి కావడానికి ప్రయత్నించాను!

కలకత్తా నేను పదిహేనవఏట వెళ్ళాను. అప్పటికి సుశీలకి ఎనిమిదోయేడు. నాకు పద్దెనిమిదేళ్ళు పూర్తికాక మునుపే మానాన్నదృష్టిలో పెండ్లియీడు వాడినయ్యాను. సుశీలకీ నాకూ వివాహం చెయ్యాలనుకున్నా రందరూ! కాని ఆజన్మబ్రహ్మచారిగాఉండి, దేశసేవ చేయాలని నా నిశ్చితాభిప్రాయం. అందువల్ల నావిద్య పూర్తయ్యేదాకా వివాహం చేసుకోనని మానాన్నతో బొంకి ఆ వివాహం ఆపివేశాను.

రెండుమూడు నెలలతర్వాత సుశీలకీ, రామాలోచనను ప్లీడరుకూ వివాహం జరిగినట్లు తెలిసింది. కాని భావిభారత భాగ్యోదయానికిగాను చందాలు వసూలుచేస్తున్న నాకు ఈ వార్త అంతగా మనస్సుకి పట్టలేదు.

నేను యింటరు చదువుతుండగా మానాన్న గతించాడు. ఇద్దరు చెల్లెండ్రను, తల్లినీ పోషించేభారం నాపైన బడది. అందువల్ల చదువుకు స్వస్తిచెప్పి ఉద్యోగాన్వేషణ చేయాల్సి వచ్చింది. అనేక కష్టాలుపడగా చివరికి ఒక ఎలిమెంటరీస్కూలు మాస్టరు ఉద్యోగం చిక్కింది.

ఈ ఉద్యోగం నాకు తగినదేనని ఎంతో ఆశపడ్డాను! నాబోధనవల్ల ప్రతిపిల్లవాడ్ని స్వాతంత్ర్య యోధుడుగా తయారు చేయాలనుకున్నాను. అదే ఉత్సాహంతో పని ప్రారం

భించాను. కాని బడిపాఠాలుతప్ప వేరే దేనినిగురించి ప్రస్తావించినా మా హెడ్‌మాస్టరు నన్ను చీవాట్లు పెట్టసా గాడు. అందువల్ల నాలోని ఆ ఉత్సాహంగూడా కొంత కాలా నికి ఉడిగిపోయింది.

నేను పెద్ద మేధావినికాను. ప్రశాంతంగా కూర్చున్న ప్పుడు ఆశాసౌధాలెన్నో నిర్మించుకుంటూను. కాని కార్య రంగంలోకి దిగగానే అన్నీ మాయమవుతాయి. చివరికి సర్వ సాధారణంగా జరిగేటట్టే జీవితాంతం వరకు అదేపనిగా కాడి మోసను వేసుకుని దున్నే దున్నపోతులాగా జీవితభారాన్ని సహించవలసి వచ్చింది. అలాంటి జీవితంలో యిక ఉత్సాహం ఎక్కడనుంచి వస్తుంది!

బడి భవనం కాపాడటానికి ఒక పంతులు రాత్రిప్పు కాపలాఉండటం అలవాటు. ఏకాకిగా ఉంటున్న నాకు ఆపని అంటగట్టారు. బడి భవనంప్రక్కనున్న ఒక పూరింట్లో ఉం టుండేవాణ్ణి.

గ్రామానికి చివర ఒక పెద్ద చెరువునుండుండేది మా బడి. చుట్టూఉన్న కొబ్బరిచెట్లు, వేపచెట్లు చల్లని నీడనిస్తుం డేవి. ఒక ముఖ్యవిషయం చెప్పటమే మరచిపోయాను. మా బడికి దాపులోనే ప్లీడరు రామలోచన్ ఉంటుండేవాడు. నా బాల్యస్నేహితురాలైన సుశీల – అతని భార్య – అక్కడే వుం టుందనికూడ నాకు తెలుసు.

రామలోచనబాబుతో నాకు పరిచయం కలిగింది. సుశీల నా బాల్యస్నేహితురాలని అతడు ఎరిగివున్నదీ లేనిదీ నాకు తెలియదు. మొదటి రోజుల్లో అది అతనికి తెలియజెయ్య

టం అనవసరమనికూడా నేననుకున్నాను. కాని ప్రసంగం మధ్యలో నామనస్సు వశంతప్పి ఆ విషయాలన్నీ దొర్లుతూ వుండేవి! – ఈవిధంగా మాట్లాడుకుంటూన్నప్పుడు ప్రక్క గదిలో గాజుల సవ్వడి, అందెల చప్పుడు వినబడుతుండేది. కిటికీ రంధ్రంగుండా రెండుకళ్ళు నన్ను తీరని బాధతో వీక్షిస్తుండేవి. హఠాత్తుగా నాహృదయం నలిగిపోయినట్లయి మహా బాధ ననుభవించేవాణ్ణి.

యింటికి చేరుకున్నాకకూడా ఆ బాధ నన్ను విడిచేది కాదు చదువుకుంటున్నా, వ్రాసుకుంటున్నా – ఏపనిలోవున్నా సరే – ఆబాధ నన్ను వీడేదికాదు.

సాయంకాలంపూట కూర్చొని నా బాధకు కారణ మేమిటా అని ఆలోచించేవాణ్ణి. ఎవరో నన్ను "నీ సుశీల ఏది?" అని ప్రశ్నించినట్లయ్యేది. నాయంతట నేను ఆమెను వదులు కున్నాను. కాని ఆమె నాకోసం యింకా నిరీక్షిస్తుంటుందని అనుకున్నానా!

ఆనాడు అడిగినంత మాత్రంలో సుశీల నాదై వుండేది. జీవితం సుఖస్వప్నమయ్యేది. కాని యిప్పుడు ఆమెను కన్నెత్తి చూడటానికికూడా అధికారంలేదు. ఆమెకు నాకు ఛేదింపరాని పెద్దగోడ అడ్డుపడ్డది!

యింతకీ సుశీల నాకేమవుతుంది గనుక? ఏమీ కాక పోవడమేమిటి! ఈనాడంటే సుశీల నాకు దూరమయింది. కాని ఆనాడు నేను అంగీకరిస్తే నాజీవిత సర్వస్వమైఉండేది. నాతో సుఖదుఃఖాలు సమానంగా పంచుకునే ఆత్మబంధువైవుండేది.

ఏమూలనుంచో రామలోచనుడు వచ్చి రెండు మంత్రాలు వుచ్చరించినంతమాత్రాన సుశీల నాదికాకపోతుందా.

యివన్నీ మీకు వ్యతిరేకంగా కనపడవచ్చు. కాని అప్పటి నామనస్థితి అట్లానేవుండేది. ఎంత ప్రయత్నించినా సుశీల నాసొమ్ము అన్నభావం నన్ను వీడేదికాదు.

అప్పటినుంచీ నామనస్సు దేనిమీద్గా లగ్నమయ్యేది కాదు. ఎల్లప్పుడూ లెఖ్ఖలపుస్తకాలు దిద్దుకుంటూ కూర్చోడం అసహ్యమనిపించేది. యింట్లో ఒక్కడ్ని కూర్చోటానికి మనస్కరించేదికాదు. ఎవరితోనూ మాట్లాడటానికికూడా విసుగుగా వుండేది. ఏకాంతంగా కొబ్బరిచెట్లనీడను కూర్చొని ఆలోచిస్తూండేవాడ్ని. మానవ సమాజమంతా తప్పులతడకగా తోచేది. దొరికిన అవకాశాన్ని చేతులారా జారవిడుచుకుని తర్వాత విచారిస్తుంటారు.

సుశీలను వివాహమాడి హాయిగా జీవితం గడుపవలసిన వాడ్ని దేశోద్ధారకుడ్ని కాదలచి—చివరకు ఎలిమెంటరీస్కూలు పంతులుగా తయారయ్యాను! నామీద ఎన్నో ఆశలు పెట్టుకున్న సుశీల పరాయివాడి చేతిలోపడ్డది— ఆరోజు సోమవారమని నాకుబాగా జ్ఞాపకం. ఏదోపనిఉండి రామలోచన్ గ్రామాంతరం వెళ్ళాడు. సుశీల ఒక్కర్తె యింట్లోవుంది.

ప్రొద్దుటినుంచే ఆకాశం మేఘావృతమైవుంది. పది గంటలకల్లా వానగూడా ప్రారంభించింది. అందువల్ల బడి త్వరగా మూసేశారు. ఆరోజంతా అదేవిధంగా గడిచింది. మర్నాడు మధ్యాహ్నంనుంచీ తుఫాను పెద్దకుంభవర్షం కురువనారంభించింది. ఆరాత్రి తుఫాను మరీతీవ్రరూపం దాల్చింది.

అలాంటప్పుడు ఇంక నిద్రేమివస్తుంది? సుశీల ఏకాంతంగా ఉండిపోయిందిగదా అని నాకు జ్ఞాపకం వచ్చింది. వాళ్ళ యింటికన్నా మాబడిభవనం దిట్టమైనది. ఆమెనక్కడకు పిలుచుకు వద్దామనుకున్నాను. కాని ధైర్యం చిక్కలేదు.

మాగ్రామం సముద్రానికి దాపులోఉంది. నడిరాత్రి కల్లా అలలచప్పుడు వినవచ్చింది. సముద్రం పొంగుకు వచ్చేస్తున్నది! మరి ఆలోచించకుండా సుశీల యింటివేపు పరుగెత్త సాగాను. చెరువుగట్టు ఎక్కుతుండేటప్పటికే నాకు మోకాలి లోతు వచ్చేసింది. చాలా ఎత్తులోనున్న గట్టుకి మాత్రం నీరు యింకా ఎక్కలేదు.

నేను గట్టుఎక్కుతుండగా అటునుంచి మరొకవ్యక్తి అదేగట్టుకి వస్తుండటం చూశాను. ఆవ్యక్తి ఎవరైనదీ నా ప్రతి రక్తనాళం గుర్తించగలిగింది. ఆమెకూడా నన్ను గుర్తించి ఉంటుంది. కొద్దిగా పైకిమిగిలిన ఆ గట్టుమీద మేమిద్దరం నిలుచున్నాం.

జలప్రళయం ఎటుచూచినా చేతికి అతికేచీకటి. అట్టి సమయంలో కొద్దిగా పైకిమిగిలిన ఆభూమిమీద మేమిద్దరమే నిల్చున్నాం. కాని యిద్దరమూ నోరు మెదపలేని స్థితిలో ఉన్నాం. క్షేమసమాచారాలయినా తెలుసుకోలేకపోయాం. ఎటుచూచినా భయంకర కాళరాత్రి – ఆ చీకటిలోకి పిచ్చిగా చూచుకుంటూ అలానే నిలుచుండి పోయాం. ఈనాడు సుశీల యావత్ప్రపంచాన్నీ విడిచి నా దగ్గరకొచ్చింది. అది ఏకాంతం.

బాల్యంలో ఒకసారి ఈ సుశీల అజ్ఞాతమైన అనంతం లోంచి వచ్చి యీ విశాలమైన ప్రపంచంలో నా చెంత నిలి

చింది. మళ్ళీ యీ నాడు, యీ కాళరాత్రిలో ప్రళయ సన్ని వేశంలో ఆ విశాల ప్రపంచాన్నంతనూ విడిచి నా ప్రక్కకి వచ్చింది. కాలం ఈకోమల కుసుమాన్ని జంఝామారుతమై నాచేతినుంచి ఎగురకొట్టుకుపోయింది. కాని జలప్రళయం మళ్ళీ ఆ కుసుమాన్ని నా చెంతకు చేర్చింది. మరొక పెద్ద అల వచ్చినట్లయితే మా యిద్దరినీ మృత్యుగర్భంలో ఏకంచేయ గలదు!

కాని ఆ అల ఎప్పటికీ రాకపోవుగాక! సుశీల తన భర్త తోనూ, పిల్లలతోనూ సుఖించుగాక! ఈ ప్రళయ సన్ని వేశంలో నేను దివ్యామృతాన్ని గ్రోలాను! అదే చాలు.

తుఫాను అంతరించింది. తెల్లవారింది. సుశీల ఒక్క మాటైనా ఆడకుండా తనయింటికి వెళ్ళిపోయింది. నేనుకూడ మౌనంగా నా పూరింటికి చేరుకున్నాను.

నేను పెద్దవుద్యోగస్తుణ్ణి కాదలచాను. దేశోద్ధారకుణ్ణి కాదలచాను. కాని చివరికి ఎలిమెంటరీ స్కూలు పంతులుగా జీవితం స్థిరపడ్డది. ఆ నికృష్ట జీవితంలోకూడా ఒక దివ్యాను భవం కలిగింది. నాజీవితంలో నాటిరాత్రికి ఎనలేని విలువ వున్నది.!

# కాబూలీవాలా

నాకూతురు మిని వయస్సు అయిదు సంవత్సరాలు. ఎప్పుడూ పసపోసిన పిట్టలాగ వాగుతూనే వుంటుంది. ఆ పిల్ల తన జీవితంలో ఒక్క నిముషమైనా మౌనంగా వుండి కాలాన్ని వ్యర్థంచేసిందని నేను చెప్పలేను. వాళ్ళ అమ్మమాత్రం చాలా విసుక్కుంటూ వుంటుంది. ఆపిల్ల వాగుడును కట్టించాలని ప్రయత్నం చేస్తుంటుంది. కాని నేను అలాచేయను. మిని మౌనంగా వుండటంఅనేది అసహజం. అలా మౌనంగావుంటే చూచి నేను భరించలేను. అందువల్ల యెప్పుడూ నేను మినిని మాట్లాడించుతూ సంతోషంగా ఆడుకొంటూ వుంటాను.

ఇలాగే ఒకనాటి వుదయం నేను నాగదిలో కూర్చొని వ్రాసుకొంటున్నాను. నేను వ్రాస్తున్న క్రొత్త నవలలోని పదిహేడవ ప్రకరణం మధ్యలో వున్నాను. మిని నెమ్మదిగా గదిలో ప్రవేశించింది. నాదగ్గరకువచ్చి చెయ్యిపుచ్చుకొని "నాన్నా! మన పనిమనిషి రాందయాల్‌కు మాటలే రావు. అన్నీ పిచ్చిపిచ్చి మాటలేమాట్లాడుతాడు. కాని పేరు సరిగ్గా చెప్పలేడు. వాడికేమీ తెలియదుగదూ?"—అంటూ మొదలు పెట్టింది.

ఈ ప్రపంచంలో యెన్నో భాషలు వున్నాయనీ, ఆ భాషల్లో ఒకదానికీ, మరొకదానికీ మధ్య చాలా భేదాలున్నాయనీ నేను చెప్పుకొంటూ వస్తుండేలోగానే ఆపిల్ల ఇంకో కొత్తవిషయంమీద సంభాషణ ప్రారంభించింది. "నాన్నా!

భోలా చెప్పేది నిజమేనా? మేఘాల్లో పెద్ద ఏనుగ వుంటుందట. ఆ ఏనుగు తొండంలోంచి నీళ్ళు జల్లుతుంటే వాన కురుస్తుందట. ఈమాట నిజమేగా, నాన్నా?"

ఈ ప్రశ్నకు యేమి సమాధానం యివ్వాలా అని నేను ఇంకా ఆలోచిస్తూవుండగానే, మిని ఇంకొక క్రొత్త ప్రశ్న వేసింది – "నాన్నా! అమ్మ నీకేమవుతుంది?"

ముఖం గంభీరంగాపెట్టి – "పోయి భోలాతో ఆడుకో మిని, నాకు చాలా తొందరపనుంది" అని, మినిని పంపివేసేందుకు ప్రయత్నించాను.

నా కిటికీగది రోడ్డువైపుకే ఉన్నది మిని టేబులు దగ్గర నా కాళ్ళకు సమీపంలో కూర్చొని మోకాళ్ళమీద చదువు కొంటూ ఆడుకోనసాగింది నేను తీవ్రంగా ఆలోచిస్తూ నా నవలలోని పదిహేడవ ప్రకరణం వ్రాస్తున్నాను. నవలలోని కథానాయకుడు ప్రతాప్‌సింగ్, కథానాయిక కాంచనలతను చేతులలో పొదువుకొని రాజభవనం మూడో అంతస్థు కిటికీ లోంచి పారవేయటానికి ప్రయత్నిస్తున్నాడు. హఠాత్తుగా మిని కూర్చున్నచోటునుంచి లేచి కిటికీదగ్గరకి ఉరుకుతూ "కాబూలీవాలా! కాబూలీవాలా!" అని కేకలు పెట్టసాగింది. నిజంగానే వీధిలో కాబూలీవాలా కనబడ్డాడు. నెమ్మదిగా రోడ్డువెంట పోతున్నాడు. కాబూలీవాలాలు ధరించే వదులుగా ఉన్న దుస్తులు వేసుకొని ఉన్నాడు. బాగా మాసిపోయి వున్నాయవి; పొడుగాంటి తలపాగా పెట్టుకొని వున్నాడు. వీపు మీద ఒక సంచీ, చేతిలో ద్రాక్షపండ్ల పెట్టెలు వున్నాయి.

ఆ పిల్లకు కాబూలీవాలాను చూడగానే యేమనిపించిందో నేను చెప్పలేను. కాని అతనిని పదేపదే బిగ్గరగా పిలవసాగింది. "అరిబాబు! వాడెట్లాగో లోపటికి వస్తాడు. ఇక నా పదిహేడవ ప్రకరణం యెన్నటికీ పూర్తికాదన్నమాట!" అని నేననుకున్నాను. అదేసమయంలో కాబూలీవాలా వెనక్కి తిరిగి మినివంక చూచాడు. మిని అది చూడటంతోటే భయపడిపోయింది. వాళ్ళ అమ్మదగ్గరకు ఒక్క పరుగులో పోయి దాక్కున్నది. అజానుబాహుడైన ఆ కాబూలీవాలా వీపు మీదవున్న సంచిలో యిద్దరో, ముగ్గురో తనలాంటి పిల్లలు ఉన్నారని ఆపిల్ల మూఢనమ్మకం. ఈలోగా కాబూలీవాలా మా యింట్లోకి ప్రవేశించి చిరునవ్వుతో నన్ను పలకరించాడు.

ఎంతో ఆసక్తితో వ్రాసుకొంటూన్న సమయంలో నా వ్రాతకు అంతరాయం కలిగింది. ఇక మిని యెట్లాగో పిలిచింది గాబట్టి యేదోఒకటి కొనకతప్పలేదు. ఏవో కొద్దిగా తీసుకొన్నాక బాతాఖానీలోకి దిగాము. మా సంభాషణ కాబూలీవాలా స్వవిషయాలను గురించి రష్యన్లనుగురించి, బ్రిటిష్‌వారి సరిహద్దు విధానాన్ని గురించీ సాగిపోయింది.

చివరికి అతడు వెళ్ళిపోయేముందు అడిగాడు—"పాపాయి యేదండీ?"

మినికి ఉన్న భయం పోగొట్టాలన్న ఉద్దేశ్యంతో నేను ఆపిల్లను బయటికి రప్పించాను.

మిని నాకుర్చీపక్క నిలచి, కాబూలీవాలావంక, అతని సంచివంకా చూడసాగింది. కాబూలీవాలా మినికి ఎండు ద్రాక్షపండ్లు, బాదంకాయలు యివ్వబోయాడు. కాని మిని

పుచ్చుకోలేదు. పైగా యింకా భయపడుతూ నాకు అతుక్కు-
పోయింది.

మిని యీవిధంగా కాబూలీవాలాను మొట్టమొదటిసారి
చూచింది.

కొద్దిరోజుల తర్వాత ఒకనాడు నేను బయటికి బయలు
దేరుతూ ఉండగా మిని తలుపుదగ్గరి బెంచిమీద కూర్చొని
కేరింతలుకొడుతూ కాబూలీవాలాతో మాట్లాడు తుండటం
చూచి ఆశ్చర్యపోయాను. కాబూలీవాలా మిని కాళ్ళదగ్గర
కూర్చొని ఎంతో ఆప్యాయంగా మాట్లాడుతున్నాడు. మిని
వాగుడు దానిజీవితంలో నేను మినహా ఆ కాబూలీవాలా
విన్నంత శ్రద్ధగా వినేవాళ్ళు ఇంకెవ్వరూ దొరకరేమో ననిపిం
చింది, ఆమె చీరచెంగున పటికిబెల్లం, ఎండుద్రాక్షపళ్ళమూట
వ్రేలాడుతున్నవి. కాబూలీవాలా మినీకి తెచ్చిన కానుక లన్న
మాట, అవి. "అవన్నీ దానికెందుకిచ్చావు?" అంటూనే నేను
ఎనిమిదణాలబిళ్ళ ఒకటి తీసి అతనికి అందిచ్చాను. అతడు
మారుమాటాడకుండా ఆడబ్బు తీసుకొని జేబులో వేసు
కున్నాడు.

కాని నేను ఓగంట తర్వాత యింటికి తిరిగి వచ్చే సరికి
ఆ యెనిమిదిఅణాలబిళ్ళ పెద్దరభసను తెచ్చిపెట్టింది! కాబూలీ
వాలా తిరిగి ఆ ఎనిమిదణాల బిళ్ళను మినికి ఇచ్చాడు. మిని
దానితో ఆడుకొంటూ వుండగా వాళ్ళఅమ్మ చూచి "ఎక్క-
డివే నీ కీ డబ్బులు?" అని గద్దించి అడిగింది.

"కాబూలీవాలా యిచ్చాడు." అన్నది మిని, భయ
పడుతూనే.

"కాబూలీవాలా యిచ్చాడా?" ఒకసారిగా అదిరిపడి "ఎందుకు తీసుకున్నావే వాడిదగ్గర?" అని ఉరిమింది తల్లి.

సరిగ్గా యీసమయంలోనే నేను యింటికిరావటం జరిగింది. మినికి దెబ్బలుతగిలే ప్రమాదం తగ్గిపోయింది. నేను విచారించి అన్ని విషయాలు తెలుసుకున్నాను.

మిని, కాబూలీవాలా కలసి అలా మాట్లాడుకోవటం అది మొదటిసారి కాదట. అలాయెన్నోసార్లు కలుసుకున్నారట. కాబూలీవాలా మినికి పటికిబెల్లము, బాదం పలుకులు యిచ్చి మొదటిలో ఆపిల్లకు ఉండిన భయాన్ని పోగొట్టాడు. తర్వాత యిద్దరూ ప్రాణస్నేహితులైపోయారు.

కాబూలీవాలాతో మిని కేరింతలు కొడుతూ యెన్నెన్నో మాటలు చెప్పేది. ఇద్దరూ అట్లా మాటలాడుకొంటూ ఉప్పొంగిపోయేవారు. మిని అతనిముందు కూర్చొని గంభీరంగా అతని పెద్ద ఆకారాన్ని పరిశీలిస్తూఉండేది. అంతలోనే కలకల నవ్వుతూ "కాబూలీవాలా! కాబూలీవాలా! నీసంచిలో యేమున్నది?" అని అడిగేది.

కాబూలీవాలా ముక్కుతో మాటలాడుతూ, కొండ జాతులవారికి సహజమైన యాసతో—"ఇందులో యేనుగుంది!" అని జవాబు చెప్పేవాడు. ఇందులో నవ్వుకోటానికి యేమంత విశేషం మనకు కనబడదు. కాని వాళ్ళిద్దరు మాత్రం పగలబడి నవ్వుకొంటూ యెంతో ఆనందపడేవారు! నాకు మొదటినుండీ కూడా ఆ పసిపాప ఆజానుబాహువైన ఆ కాబూలీవాలాతో కేరింతలు కొడుతూ మాటలాడుతుంటే తమాషాగా అగుపించేది.

కాబూలీవాలాకూడా సంభాషణలో తానువో శిపో గూడదన్నట్లు - "అయితే పాపా,- నువ్వు అత్తవారింటి కెప్పు డెళ్తావు?" అని అడిగేవాడు.

సాధారణంగా ప్రతి భారతీయ బాలిక "అత్తవారిల్లు" అన్నపదాన్ని పసిప్రాయంనుంచే వింటూవస్తుంది. కాని మేము కొంత నవనాగరికులమై ఉండటంచేత మినికి యీపదంయొక్క అర్ధం ఇంతవరకు తెలియనివ్వకుండా ఉంచాము. అందువల్ల మిని ఆ పదం విన్నప్పుడు కొంత దిగ్భ్రమ చెంది ఉంటుంది. కాని ఆ పిల్ల ఆ విషయాన్ని బయటికి ప్రకటించేదికాదు. చాలా తెలివితేటలు ప్రదర్శిస్తూ-"మరినువ్వు యెప్పుడెళ్తావు అత్తా రింటికి?" అని అడిగేది.

నిజానికి కాబూలీవాలాలలాంటి జాతులవారికి "అత్త వారిల్లు" అన్నపదానికి రెండర్థాలున్నవి. తమ ఖర్చులేమీ లేకుండా జాగ్రత్తగాచూచే జైలును వ్యంగ్యంగా "అత్తవా రిల్లు" అని పిలుస్తుంటారు! కాబూలీవాలా యీ అర్థాన్ని మనస్సులో ఉంచుకొని మిని ప్రశ్నకు సమాధానంగా-"ఆహా మా మామవాళ్ళు చితుకపొడుస్తాను." అంటూ మనస్సులో ఊహించుకొన్న పోలీసువాడి నుద్దేశించి గాలిలో తన పిడికిలి జాడించేవాడు. ఈమాటలు వింటూ కాబూలీవాలాను చూచి మిని పగలబడి నవ్వేది. కాబూలీవాలాకూడా బిగ్గరగా నవ్వే వాడు.

అవి ఆకురాలుకాలపు రోజులు. ఉదయాలు యెంతో మనోహరంగా వుంటాయి. పూర్వకాలపు రాజులు యిలాంటి సమయాల్లోనే దండయాత్రలకు బయలుదేరేవారు. నేను

కలకత్తాలోని యింటిగదిలో కూర్చునే నామనోవిహంగాన్ని ప్రపంచమంతా విహరింపజేస్తుంటాను. ఏదైనా ఒక పరాయి దేశాన్ని గురించి తెలుసుకొన్నంతనే నామనస్సు అక్కడికి పోయి వాలుతుంది. విదేశీయుడెవడైనా కనబడ్డాడంటే దూరాన ఉన్న అతని దేశము, ఆ దేశంలోని ప్రకృతిశోభ, ఆశోభాయమానమైన ప్రకృతిమధ్య అతని గృహము, ఆ గృహములో అతడు పీల్చే స్వేచ్ఛావాయువులు నాకళ్ళ ముందు కలల్లాగ కనబడుతుంటాయి. ఆ దేశాలు పర్యటిస్తూ ఆనందతరంగాలలో ఉర్రూతలూగాలని నా ఆశ!

కాబూలీవాలాను చూచినప్పుడు అతనిదేశం నామనో వీధిలో ప్రత్యక్షమయ్యేది. ఆకాశాన్నంటే పర్వతపంక్తులు వాటిమధ్య లోయలగుండా సన్నటిపాముల్లాగ మెలికలుతిరుగు కొంటూ పోయే దారులు ఊహాపథంలో కనబడేవి. ఆదారుల గుండా నాటుతుపాకులు భుజానవేసుకొని ఒంటెలమీద వర్తకపుసామాను తీసుకువస్తున్న ఆజానుబాహువులైన కాబూలీవాలాలు కనబడేవారు. ఇలా మనఃప్రపంచంలో అలాంటి దృశ్యాలను చూస్తున్నసమయంలో మినుతల్లి నా ఊహావాహినికి అడ్డుతగిలి- "ఆ కాబూలీవాలా విషయంలో జాగ్రత్తసుమండి!" అని అంటుండేది.

మిని తల్లి చాల భయస్తురాలు. వీధిలో యేమాత్రం గలభా వినుపించినా, ఇంటివైపు యెవరన్నా వస్తున్నా దొంగ లొస్తున్నారనో, లేక త్రాగుబోతులు యింటిమీద పడు తున్నారో అనుకుంటుంది. ఏమాత్రం సవ్వడివిన్నా పులులో పాములో వచ్చేశాయని భయపడిపోతుంది. ఇన్ని సంవత్స

రాల ప్రపంచానుభవం తర్వాతగూడా ఆమెకు యీభయాలు పోలేదు. అందువల్ల ఆమెకు కాబూలీవాలానుగురించి యెన్నో వల్లమాలిన భయాలు. వాడిని జాగ్రత్తగా ఒకకంట కని పెడుతూ వుండమని నన్ను ప్రాధేయపడేది.

నేను ఆమాటలను తేలిగ్గా తీసుకొని నవ్వేవాడిని. అందుకామె ముఖం గంభీరంగాపెట్టి ఇలా నన్ను అడిగేది.

"పిల్లల్ని యెత్తుకుపోవటం మీరెన్నడూ వినలేదా?"

"పిల్లల్ని యెత్తుకొనిపోయి కాబూలులో బానిసలుగా అమ్ముకొనేవారు కాదా?"

"బ్రహ్మరాక్షసిలా ఉన్న వీడు పళిపిల్లను యెత్తుకు పోవటం యేమంత పెద్దపని?

అవన్నీ అర్థంలేనిమాటలని నేను మినుతల్లితో వాదిం చేవాడిని. కాని ఆమెకుమాత్రం నమ్మకం కలిగేదికాదు. ఆమెకుగల అనుమానము, భయము తొలగేవికాదు. అయినా ఆధారంలేని ఆమె భయాన్ని కారణంగా తీసుకుని ఆ కాబూ లీవాలాను రావద్దని యెట్లా అనగలను. అందువల్ల కాబూలీ వాలా, మా పాపలస్నేహం నిరాఘాటంగా కొనసాగిపోతూనే వచ్చింది.

ప్రతియేడాది జనవరిమాసం మధ్యలో కాబూలీవాలా తన స్వదేశానికి వెళ్ళివస్తుండేవాడు. దానికిముందు చాలా చురుకుగా యింటింటికీ తిరుగుతూ బాకీలన్నీ వసూలు చేసుకొనే వాడు. ఈయేడాది యెన్నిపనులున్నా కాబూలీవాలా మినీని చూడటానికి రావటంమాత్రం మానేవాడు కాదు. ఉదయం

వీలుకాకపోతే సాయంత్రమో, సాయంత్రం వీలుకాకపోతే ఉదయమో తప్పక వచ్చిపోయేవాడు మినీని చూడటానికి.

కాని నాకుకూడా వీళ్ళస్నేహం చూస్తుంటే ఒక్కొక్కసారి ఆశ్చర్యం కలుగుతుండేది. దీర్ఘకాయుడైన ఆకాబూలీవాలా, తన సంచులు మోసుకొని వస్తుంటే – "ఓ కాబూలీవాలా! కాబూలీవాలా! అంటూ మినీ అతని చూచి పరుగెత్తుకొని వెళ్ళేది. మినీను చూడగానే కాబూలీవాలాలోని శ్రమంతా మటుమాయమైపోయేది. ఇద్దరూ యెప్పట్లాగే హాస్యాలాడుకొంటూ, పకపక నవ్వుకొనసాగేవారు. వయస్సులో యెంతో తేడావున్న యీయిద్దరి స్నేహంచూస్తే నాకు వింతగా తోచేది.

కాబూలీవాలా తన స్వదేశానికి పోయిరానటానికి సంసిద్ధమవుతున్న రోజులవి. ఒకనాటి ఉదయం నేను గదిలో కూర్చొని నా నవల ప్రూఫులు దిద్దుకుంటున్నాను. చలిగాలి వీస్తున్నది. కిటికీలోంచి వస్తున్న సూర్యకిరణాలు నాకాళ్ళ మీదపడి వెచ్చదనాన్నిస్తున్నాయి. దాదాపు ఎనిమిదిగంటలు కాబోతున్నది. వీధిలో అమ్ముకొనేవాళ్ళు నెత్తిమీద బుట్టలు పెట్టుకొని అప్పుడే బయలుదేరుతున్నారు. హఠాత్తుగా వీధిలో యేదో గొడవ వినబడింది. కిటికీలోంచి బయటికి చూచాను. ఇద్దరు పోలీసులు అటుయిటుఉండి కాబూలీవాలాను నడిపించుకొని వస్తున్నారు. వాళ్ళ వెనుక ఆ వింతను చూస్తున్న జనం నడుస్తున్నారు. కాబూలీవాలా గుడ్డలమీద నెత్తురుమరకలు కనబడుతున్నాయి. ఒక పోలీసువాడిచేతిలో కత్తి వున్నది. నేను గబగబా బయటికి వెళ్ళి అదంతా ఏమిటని అడిగాను.

ఎవరో కాబూలీవాలా దగ్గరనుంచి వాయిదా పద్ధతిమీద రాంపురి శాలువా కొనుక్కున్నారట. కాబూలీవాలా డబ్బు వసూలు చేసుకోటానికి పోయినప్పుడు శాలువా కొనుక్కున్నతడు. తాను అసలు శాలువా తీసుకోనేలేదని బుకాయించాడట. దానితో ఘర్షణ ప్రారంభమై. కాబూలీవాలా కోపం పట్టలేక, వాడిని కత్తితో పొడిచాడట. ఇంకా కోపంతో మండిపోతూనేవున్న కాబూలీవాలా శాలువా కాజేసినవాడిని తిడుతూనేవున్నాడు. ఇంతలో రోజు విధంగానే నా కూతురు మిని వరండాలోకి వురికివచ్చి – "ఓ కాబూలీవాలా! కాబూలీవాలా!" అని కేక వేసింది. మినిని చూడగానే అతని ముఖం వికసించింది. అతని వీపుమీద నేడు సంచిలేదు. కాబట్టి మిని ఏనుగు సంగతి యెత్తలేదు. వెంటనే రెండవ ప్రశ్న అడిగింది – "మీ అత్తగారింటికి పోతున్నావా?" కాబూలీవాలా నవ్వాడు. "అవును ఇప్పుడు అక్కడికే వెళుతున్నాను." అన్నాడు. కాని ఆ జవాబు పాపకు ఆనందాన్ని కలిగించలేదని గ్రహించి అతడు మళ్ళీ యిట్లన్నాడు–"అహా...అదుగో మా మామను చితకబాదిచ్చి వుండేవాడినే. కాని నా చేతులు కట్టుబడిపోయి వున్నాయి!" అంటూ సంకెళ్ళు వేసివున్న తన చేతులు చూపించాడు.

హత్య చేయటానికి ప్రయత్నించిన నేరానికిగాను కాబూలీవాలాకు కొన్ని సంవత్సరాల కఠినశిక్ష విధింపబడ్డది.

కాలం గడిచిపోయింది. కాబూలీవాలాను అందరమూ మరచిపోయాము. యథావిధిగా మా రోజువారీ పనులలో మునిగిపోయాము. స్వేచ్ఛగా బ్రతుకుటకు పెట్టిందిపేరైన

కొండజాతికిచెందిన కాబూలీవాలా యెండతరబడి జైలులో మగ్గుతున్నాడన్న విషయం మా కెవ్వరికీ తట్టనేలేదు. కేరింతలు కొడుతూ అతనితో రోజూ ఆడుకొనే మా మినికూడా అతనిని పూర్తిగా మరిచిపోయింది. ఆపిల్ల జీవితంలో కొత్త స్నేహితులు ప్రవేశించారు పెద్దదై పెరుగుతున్నకొలది తన యీడు ఆడపిల్లలతోనే ఆడుకోవటం, స్నేహం చేయటం మొదలుపెట్టింది. చివరికి మిని యెంత మారిపోయిందంటే, యెప్పుడూ ఆడపిల్లలతోనే తన కాలాన్నంతా గడుపుతూ తండ్రినయిన నాదగ్గరికి రావటంకూడా తగ్గించివేసింది. అందువల్ల ఆపిల్లతో నేను మాట్లాడటంకూడా తగ్గిపోయింది.

సంవత్సరాలు గడిచిపోయాయి. ఆకురాలు కాలం వచ్చింది. మిని వివాహానికి మేము యేర్పాట్లు చేసాము. దుర్గాపూజశలవుల్లో ముహూర్తం పెట్టాము. దుర్గ కైలాసాని నిష్క్రమించినట్లే మాయింటికి వెలుగుగా ఉండిన మా మిను అత్తవారింటికిపోతూ మమ్మందరినీ చీకటిలో ముంచివేయబోతోంది.

ఉదయపు నీరెండ అందంగా బంగారం కరగపోసినట్లు పడుతోంది. అంతకుముందు కురిసిన వానల మూలాన గాలి పవిత్రమయినట్లనిపిస్తున్నది. అలాంటి మనోహరమైన వాతావరణంలో ప్రొద్దుటినుంచి పెండ్లి మంగళ వాయిద్యాలు మ్రోగసాగినవి. ఆ వాయిద్యాలు వింటుంటే నాగుండె కొట్టుకొనసాగింది. జరుగబోయే వియోగాన్ని తలచుకొంటుంటే నాహృదయం బరువెక్కుతోంది. ఆ రోజురాత్రి మా మినికి వివాహం.

ప్రొద్దుటినుంచీ యిల్లంతా గందరగోళంగా ఉన్నది. పెండ్లి పనులన్నీ చురుకుగా జరుగుతున్నాయి. పనివాళ్ళు యింట్లో అటూ యిటూ ఉరుకుతున్నారు. నేను గదిలో కూర్చొని లెక్కలు చూచుకొంటున్నాను. ఇంతలో యెవరో గదిలో ప్రవేశించి, నమస్కారంచేసి నాముందు నిలబడ్డారు. అతడే కాబూలీవాలా. మొదట్లో నే నతడిని గుర్తుపట్టలేదు. అతని వీపుమీద సంచిలేదు. తలవెంట్రుకలు పొట్టిగా కత్తిరించబడి వున్నాయి. అతనిలో పూర్వపు ఉత్సాహం కనబడటంలేదు. అతని చిరునవ్వునుబట్టి అతనిని గుర్తుపట్ట గలిగాను.

"ఎప్పుడు వచ్చావు?" అని అడిగాను.

"నిన్నటి సాయంత్రం జైలునుంచి విడిచారు" అని జవాబు చెప్పాడు.

ఆ మాటలు కటువుగా వినబడ్డాయి నాకు. నే నిదివరకెన్నడూ ఒక నేరస్తునితో మాట్లాడియుండలేదు. ఆ విషయం తలుచుకొంటే నాకెట్లానో అనుపించింది. పైగా మా మిని వివాహ సమయంలాంటి శుభసమయంలో అటువంటి వ్యక్తి ప్రత్యక్షం కావటం నాకు యేమీ బాగనిపించలేదు.

"పెళ్ళి హడావుడిలో ఉన్నాము. నేను చాలాతొందర పనిలోవున్నాను. ఇంకొకప్పుడు వస్తే బాగుంటుందేమో?" అన్నాను.

అతడు వెంటనే వెళ్ళిపోవటానికి వెనక్కు తిరిగాడు. కాని తలుపుదగ్గరకు చేరినతర్వాత కొద్దిగా ఆగి సంశయిస్తూ యిలా అన్నాడు - "ఒక్కసారి ఆపాపను చూడటానికి వీలుంటుందా?"

మిని ఇంకా తాను కొన్ని సంవత్సరాలక్రితం చూసిన పసిపిల్లగానే ఉన్నదని అతను అనుకొంటున్నట్లున్నది. అప్పటి లాగానే గంతులు వేసుకొంటూ "కాబూలీవాలా! కాబూలీ వాలా!" అని కేకలు పెట్టుకొంటూ వస్తుందని అతను భావించుకున్నట్టున్నాడు. పూర్వంలాగనే ఇద్దరుకూర్చొని నవ్వుకొంటూ మాట్లాడుకొంటారని అనుకున్నాడు. అలా తలంచుకొని యుండటంచేతనే పూర్వపువిధంగానే మినికోసం ఒక కాగితంలో జాగ్రత్తగా పటికిబెల్లము, ఎండుద్రాక్షపప్పు బాదంపలుకులు కట్టుకొని తీసుకువచ్చాడు. బహుశా అన్నీ తన తోటిదేశీయుని యెవరినో అడిగి తెచ్చివుంటాడు. లేక పోతే జైలునుండి యిన్ని సంవత్సరాలతర్వాత తిరిగివస్తున్న వాడిదగ్గర డబ్బుయెట్లా ఉంటుంది!

నేను మళ్ళీ అతనితో యిలా అన్నాను- "అంతా పెండ్లి గందరగోళంలో ఉన్నారు. ఇప్పుడెవరినీ కలవటానికి వీలుండదు.

కాబూలీవాలా తలవంచుకున్నాడు. కొద్దిసేపాగి మళ్ళీ తలయెత్తి నావైపు జాలిగా-చూచాడు. "సెలవు-వెళ్ళొస్తాను" అని బయలు దేరాడు.

ఆస్థితిలో అతన్ని చూస్తుంటే నాకు జాలికలిగింది. వెనుకకు పిలుద్దామని అనుకున్నాను, కాని అతడు తిరిగి రా సాగాడు. నాదగ్గరకువచ్చి నిలబడి తను మినికోసం తెచ్చిన పొట్లాం అందిస్తూ- "పాపకోసం యివి తీసుకొచ్చానండి. పిల్లకు అందజేస్తారా?" అని ప్రాధేయపడ్డాడు.

ఆ పొట్లం తీసుకొని డబ్బు లివ్వబోయ్యాను. కాబూలీ వాలా నా చెయ్యి పుచ్చుకొని ఆపి—"వద్దండి, బాబూ. మీ దయవుంటే అంతేచాలు. నన్నుమాత్రం మరిచి పోకండి. అంతే నాకుచాలు. డబ్బుమాత్రం వద్దు. మీకున్న పాపలాంటి పాపే నాకూ మా దేశంలో ఉన్నది." అన్నాడు భారంగా.

ఈమాటలు అంటూ అతను తన చొక్కా లోపలి జేబు లోకి చెయ్యిపోనిచ్చి, మాసిపోయి ముడుతలుపడి ఉన్న ఒక కాగితాన్ని తీసాడు. ఆకాగితాన్ని టేబిలుమీద ఉంచి రెండు చేతులతోను జాగ్రత్తగా సరిచేయసాగాడు. అది ఫోటోగ్రాఫు కాదు డ్రాయింగుకూడా కాదు. చిన్న అరచేతికి సిరారాసి తీసిన ముద్ర. ప్రాణమంతగా ప్రేమించే తనకూతురు చేతి ముద్రను అతను ఆ విధంగా యల్లప్పుడూ తన హృదయం ప్రక్కనే భద్రపరచుకొని ఉంచుకుంటాడన్నమాట.

నాకండ్లు చెమ్మగిల్లాయి. నేను యెంతో చిత్తసంస్కారం కలవాడిననీ, అతను సాధారణమైన కాబూలీవాలా అని అను కొంటూ ఉండేవాడిని. కాని అతడుకూడా నిండు హృదయం గల ఒకతండ్రే! నాకున్నట్టే అతనికీ ఒక గారాబుబిడ్డ ఉన్నది.

కొండ ప్రాంతాలలోని అతని మాతృదేశంలోవున్న అతని చిన్నారికూతురు పార్వతి చేతిముద్ర చూస్తూఉంటే చిన్ననాటి మా మిను నాకు గుర్తుకువచ్చింది.

వెంటనే నేను మినికోరకు లోపలికి కబురుపంపించాను. పిల్లను బయటికి పంపటానికి ఆడవాళ్ళు యెన్నో ఆటంకాలు తెలిపారు. కాని నేను వాటన్నిటిని త్రోసిరాజని పిల్లను బయ టికి రప్పించాను. పెండ్లికికొన్న ఎర్ర సిల్కుచీర కట్టుకొని

బుగ్గను మచ్చతో పెండ్లికూతురుగా తయారయివున్న మిని సిగ్గుపడుతూవచ్చి నాముందర నిలబడ్డది.

కాబూలీవాలా ఆ వేషంలోవున్న మినిని చూచి నివ్వెర పోయినట్లు కనబడ్డాడు. వారిమధ్య ఉండిన పాతస్నేహాన్ని పునరుద్ధరించుకొనలేకపోయాడు. చివరికి కొంతసేపైన తర్వాత చిన్నగా నవ్వుతూ–"ఏం, చిట్టితల్లీ! మీా అత్తవారింటికి వెళ్ళుతున్నావా?" అన్నాడు.

కాని ఇప్పుడు మినికి "అత్తవారిల్లు" అన్నపదానికి అర్థం తెలుసు. అందువల్ల పూర్వంలాగ అతనికి జవాబివ్వలేక పోయింది. పెండ్లికూతురుకుండే సహజమైన సిగ్గుతో తలవంచు కొని అతనిముందు నిలబడ్డది.

మామిని కాబూలీవాలాను మొట్టమొదటి రోజు కలసి కొన్న దృశ్యం నాకు గుర్తుకువచ్చింది. నామనస్సు కలత పొం దింది. మిని లోపలికి వెళ్ళిపోగానే కాబూలీవాలా బరువుగా నిట్టూర్చి కిందకూలబడి పోయాడు. తాను తన కుటుంబం నుంచి దూరంగావున్న యీదీర్ఘకాలంలో తనకూతురుగూడా యీదేవిధంగా పెద్దగా పెరిగివుంటుందనీ, తనచిన్నారి కూతు రను చూచుకోవాలని అతనికి అనుపించినట్లున్నది. తాను వదలి వచ్చినప్పుడు ఉన్నట్లుగా యిప్పుడు వుండబోదన్నమాట మాత్రం వాస్తవం. పైగా యీదీర్ఘకాలంలో ఆ పిల్లకు యేమేమి సంభవించి ఉండకూడదు!

పెండ్లి మంగళవాయిద్యాలు మ్రోగుతున్నాయి. నును వెచ్చని యెండ మాచుట్టూ ఆక్రమిస్తున్నది. కాని కాబూలీ

వాలా మాత్రం అక్కడే కూలబడివున్నాడు. అతని స్వదేశం తప్ప మరేమీ అతని కండ్లకు కనబడటంలేదు.

నేను వెంటనే ఒక వందరూపాయిల నోటుతీసి కాబూలీవాలాకు యిస్తూ అన్నాను-"మీ దేశం వెంటనే వెళ్ళిపోయి నీబిడ్డను చూచుకో. మీతండ్రీ కూతుళ్ళు కలసికొని సంతోష పడితే నాబిడ్డకుకూడా శుభం కలుగుతుంది!"

వందరూపాయలు కాబూలీవాలాకు యివ్వటంమూలాన పెండ్లిలో అనేక ఖర్చులు తగ్గించుకొనవలసివచ్చింది. మొదట అనుకున్న విధంగా ఎలక్ట్రిక్ లైట్లు, బ్యాండు మేళం పెట్టించ లేకపోయాను. అవి లేకపోవటంచేత ఇంట్లోని ఆడవాళ్ళు ముఖాలు చిన్నబుచ్చుకున్నారు. కాని నాకుమాత్రం విచారం కలుగలేదు. తనబిడ్డకు దూరమైపోయిన ఒకతండ్రి తిరిగి తన గారాబు బిడ్డను కలసికొన్నాడన్న విషయం తలచుకొన్న ప్పుడు నాకుయెంతో ఆనందం కలిగింది. మా మిని వివాహం ఎలక్ట్రిక్ లైట్లు, బ్యాండుమేళం లేకపోయినా యెంతో వైభ వోపేతంగా జరిగినట్లనుపించింది.

# అనగా, అనగా ఒకరాజు

"అనగా, అనగా ఒక రాజు"

పిల్లలుగా వున్నప్పుడు మాకు ఈ పేదరాశిపెద్దమ్మకథ లోని ఆ రాజెవరో తెలుసుకొన వలసిన అవుసరం ఉండేది కాదు. ఆ రాజు పేరు శిలాదిత్యుడో, లేక శాలివాహనుడో, అతడు కాశీలో వుండేవాడో, లేక కనోజ్ లో వుండేవాడో మాకు పట్టేదికాదు. ఏడు సంవత్సరాల పిల్లవాడి హృదయాన్ని ఆనందంతో గంతులు వేయించే పరమ సత్యమల్లా ఒక్కటే,—

"అనగా, అనగా ఒక రాజు"

కాని ఈ ఆధునిక యుగ పాఠకులు అంత సులభంగా ఊరుకునే రకం కారు. అన్నివివరాలు వాళ్ళకే కావాలి. ఏద యినా కథను అట్లా ప్రారంభించేట్లయితే వెంటనే ఆపుతారు. వాళ్ళకుతగని అనుమానము. తమ ఆధునికశాస్త్రవిజ్ఞానపు వెలు గునంతా ప్రసరింపజేసి వెతుకుతూ అడుగుతారు—

"ఎవరారాజు?" అని

నేటికథకులుకూడా చాలాఖచ్చితంగా వుంటున్నారు. "అనగా, అనగా ఒక రాజు" అనే తలా తోకలేని పద్ధతితో వారుసంతృ ప్తిపడటంలేదు. తమ అపారమైన విద్వత్తునంతా ప్రదర్శించు కుంటూ "అనగా, అనగా అజాత శత్రువు అనేరాజు వుండే వాడు" అని ప్రారంభిస్తారు.

కాని నేటి పాఠకుడి ఆసక్తి అంతటితోగూడా సంతృప్తి పడదు. తన వైజ్ఞానిక సులోచనాల ద్వారా కథకుడివైపు

ప్రశ్నార్థకంగా చూస్తూ మళ్ళీ అడగకుండానే అడుగుతాడు—
"ఏ అజాత శత్రువు?" అని

మేము పిల్లలుగా వున్నప్పుడు యెన్నో మధురమైన విషయాలను అర్థం చేసుకోగలిగేవాళ్ళం. మాలోని అమోఘమైన శక్తితో పేదరాశిపెద్దమ్మ కథల్లోని మాధుర్యాన్ని చూరగొనగలిగేవాళ్ళం. జ్ఞానం మొదలైనటువంటి పనికిమాలిన విషయాలతో మాకు ప్రశక్తి వుండేదే కాదు. మాకు కావలసినదల్లా సత్యం- అంతే, అరమరలు లేని మాచిట్టి హృదయాలకు సత్యం యెక్కడవున్నదన్న విషయమూ, దానినెలా చేరుకోవాలన్న విషయం బాగా తెలిసియే ఉండేవి. కాని యీనాడు సవాలక్ష వివరాలు వ్రాయవలసివుంటుంది. చివరికి వాటన్నిటి సత్యం మాత్రం ఒక్కటే—

"అనగా, అనగా ఒకరాజు"

కలకత్తాలో ఒకనాటి సాయంత్రం ఆ పేదరాసి పెద్దమ్మ కథ ప్రారంభంకావడం నాకు యీనాటికిగూడా బాగా గుర్తున్నది. రోజంతావాన కురుస్తూనేవుంది. నగరమంతా నీటిమయం అయిపోయింది. మా వీధిలో మోకాటిలోతు నీరుచేరింది. ఆరోజు నాకు చదువుచెప్పేపంతులు ఇక రాడన్న ఆశతో ఎదురుచూస్తూన్నాను. మాయింటివరండాలో ఒక మూల కూర్చొని దడదడకొట్టుకొంటున్న గుండెతో వీధివైపు చూస్తూ కూర్చున్నాను. ప్రతిక్షణం నాచూపులు వానమీద నేవుంటూ వచ్చినవి. వానగాని కొద్దితగ్గు ముఖం పట్టినా అంటే, నామనస్సంతా కేంద్రీకరించి—"భగవంతుడా! ఏదున్నరవరకూ యిట్లాగే వాన కురిపిస్తూవుండు" అని దేవుడిని

ప్రార్థించసాగేవాడిని. కలకత్తాలోని ఒకమూలవున్న ఒకానొక అసహాయ బాలుని, అతని పంతులుగారి క్రూర దంష్ట్రలనుండి రక్షించటానికి ఆ వాన కురుస్తూన్నదనే నమ్మాను.

భగవంతుడు నా ప్రార్థన నాలకించిన ఫలితమో, లేక యేప్రకృతిధర్మా న్ననుసరించో గాని మొత్తంమీద ఆసాయంత్రం అంతా వానకురవటం ఆగనేలేదు. కాని మా పంతులు మాత్రం ఆగాడనా!.

నియమితమైన సమయానికి సరిగ్గా నిముషాల ప్రకారం వీధిమళుపులో అతని గొడుగు మాయింటిని సమీపిస్తూండటం కనబడ్డది. నాఆశ నీటిబుడగపగిలినట్లు ఒక్కసారిగా పగిలిపోయింది. నాగుండె గుబేలుమన్నది. చావు తర్వాత యీ ప్రాణులకు వారి పాపకర్మాలకు తగినశిక్ష ఉండటం నిజమైనట్లయితే తిరిగి మా పంతులు నాస్థానంలోను, నేను మా పంతులు స్థానంలోను పుట్టాల్సిందే.

మాపంతులు గొడుగు కనబడీకనబడటంతోనే నేను నాశక్తికొద్దీ ఒక్క పరుగున పోయి మా అమ్మగదిలో పడ్డాను. మాఅమ్మ, నాయనమ్మ ఒకచోట కూర్చొని లోకాభిరామాయణం మాట్లాడుకొంటున్నారు. ఒకఅంగలో వెళ్ళి మాఅమ్మ ప్రక్కనఉన్న పరుపుమీదపడి—"అమ్మా, నాకు చచ్చే తలనొప్పిగావుంది. పంతులు వస్తున్నాడు గాని ఎట్లా చదువుకోను?" అని మారాం చేయసాగాను.

పిల్లవాళ్ళెవళ్ళూ యీకథ చదువటానికి అనుమతింపబడబోరని నేను నమ్ముతున్నాను. ఈకథ పిల్లల సాహిత్యగ్రంథా

లలో చేర్చబోదని అంతకంటే గట్టిగా నమ్ముతున్నాను. ఎందుకంటే నేనుచేసినపని చాలాచెడ్డపని. పైగా దానికితగిన శిక్షను పొందలేదు. అంతేగాక నాదుష్టకార్యం అనుమతింప బడిందికూడాను.

మాఅమ్మ నాతో—"సరేలే, సరేలే" అంటూ పనివా డినిపిలిచి "పంతులుగారిని యింటికి వెళ్ళిపోవచ్చునన్నామని చెప్పు" అన్నది.

మాఅమ్మ, నాయనమ్మలు తమలోకాభిరామాయణం లోఇంకా అలాగే మునిగివున్నారు. దానినిబట్టి వాళ్ళు నాతల నొప్పి సంగతి అంత పట్టింపుగా తీసుకోనేలేదని వేరే చెప్ప నవసరంలేదు. నాయెత్తు ఫలించినందుకు నాలోనేను యెంతో నవ్వుకున్నాను. మా అమ్మ, నేను ఒకళ్ళ నొకళ్ళం బాగా అర్థం చేసుకొన్నాము.

కాని యేడు సంవత్సరాలబాలుడు జబ్బును నటించటం యెంత కష్టమైనపనో మీకందరికీ తెలిసినవిషయమే. ఒక నిము షం తర్వాత నేను మా నాయనమ్మను పట్టుకొని "నాయ నమ్మా, నాకొక కథచెప్పవూ?" అని అడిగాను.

అలా చాలాసార్లు అడుగుతూ ఆమెను వేధింపసాగాను. కాని వాళ్ళ లోకాభిరామాయణంలో పడియున్న మాఅమ్మా నాయనమ్మలు నామాటలు చెవికిపట్టించుకోనేలేదు. చివరికి మాఅమ్మ నాతో యిలాఅన్నది "ఉండరా నాయనా, మాటల్లో అడ్డంరాక" కాని నేను మాత్రం ఊరుకోలేదు. "నాయనమ్మా నాకొక కథచెప్పవూ?" అంటూ వేధిస్తూనే

ఉండినాను. వాళ్ళ మాటలు రేపు మాట్లాడుకోవచ్చుగాని, నాకు మాత్రం అప్పుడే కథ చెప్పాలని నేను వేధింపసాగాను.

చివరికి మాఅమ్మ "అబ్బా! వీడి పోరు పడలేకుండా వున్నానమ్మా వాడికేంకావాలో చెబుదూ తల్లీ" అన్నది. నాయనమ్మతో కథ చెప్పకపోయినట్లయితే మళ్ళీ మర్నాడు పంతులు దగ్గర నేను హాఠంచేస్తాననీ, పంతులు నాతో వేగలేక సతమతమౌతాడనీ మాఅమ్మ అనుకొనివుంటుంది. అందుకే నాబాధను వదల్చుకోవటానికి నాయనమ్మను కథ చెప్పమన్నది.

అమ్మ కథ చెప్పమని అనీ అనటంతోనే నేను పోయి మా నాయనమ్మను కౌగిలించుకొన్నాను. ఆమె చెయ్యిపుచ్చుకొని ఆనందభరితమైన హృదయంతో గంతులువేస్తూ నాయనమ్మను నా పక్కదగ్గరకు యీడ్చుకుపోయి కూర్చోబెట్టి అన్నాను "ఇక కథచెప్పు నాయనమ్మా!"

నాయనమ్మ కథ చెప్పసాగింది. "ఆ రాజుకు ఒక రాణి ఉన్నది.

భలేగా మొదలైంది కథ, ఒక్కత్తేరాణి!

సాధారణంగా వేదరాసి పెద్దమ్మ కథల్లో రాజులకు అనేకమంది రాణులుండటం పరిపాటి. ఇద్దరు రాణులున్నారని యెప్పుడైనా విన్నామంటే మనగుండె నీరైపోతుంది. అందులో ఒక రాణి తప్పక కష్టాలపాలవుతుంది. కాని మా నాయనమ్మ చెబుతున్న కథలో అటువంటి ప్రమాదం యేమీ కనబడటం లేదు. ఆ రాజుకు ఒక్కతే రాణి కాబట్టి, ఆ భయంలేదు.

నాయనమ్మ కథలోని రెండవ వివరం యేమిటంటే ఆ రాజుకి కొడుకుల్లేరు. కొడుకుల్లేకపోతే మనుష్యులు వ్యథ పడాల్సి వుంటుందని ఏడుసంవత్సరాల లే ప్రాయంవాడికి నాకేం తెలుస్తుంది? వస్తూ దారిలో యెక్కడుండిపోయాడో!

అంతేకాదు. కొడుకు కోసం రాజు తపస్సుచేయటానికి మహారణ్యాలకు వెళ్ళాడని విన్నప్పుడుకూడా అందులో యేమంత పెద్దవిశేషం కనబడలేదు. ఒకవిషయమైతే నాకుబాగా అర్థం అయ్యేది. బడి పంతులు బాధనుంచి తప్పించుకోటానికి యెవరైనా అరణ్యాలకు పోయారంటే నాకు బాగా అర్థం అయివుండేది!

తపస్సుకు వెళ్ళేటప్పటికి రాజుకు ఒక కుమార్తె వుండేది. ఆ పిల్ల పెరిగి పెద్దదయి అపురూప సుందరంగా తయారయింది.

పన్నెండు సంవత్సరాలు గడచిపోయినా రాజు ఇంకా తపస్సు చేసుకొంటూనే వుండిపోయాడు. పెరిగి పెద్దదవుతున్న కుమార్తె సంగతే ఆలోచించలేదు. రాకుమార్తె యౌవనవతి అయింది. పెండ్లియీడుదాటిపోతున్నా రాజు యింకా తిరిగి రాలేదు. రాణి "నాబంగారు బిడ్డకు యింక పెండ్లేకాదా? నేనేంపాపంచేశాను భగవంతుడా?" అని కంటికి మంటికి యేక ధారగా యేడ్వసాగింది.

ఒక్క రాత్రికోసమైనా నా రాజాంతఃపురానికి దయచేసి ఒక్కపూట భోజనంచేసి వెళ్ళమని రాజును వేడుకొంటూ రాణి యెన్నోకబుర్లు పంపించింది. చివరికి రాజు అందుకు అంగీకరించాడు.

రాణి స్వయంగా తనచేతులతో రాజుకోరకు అరవై నాలుగు పిండివంటలూ తయారుచేసింది. మంచిగంధపు పీట వేసింది. బంగారు గిన్నెల్లో వడ్డనచేసింది. రాజకుమార్తె నెమలి పింఛాల విసనకర్ర చేతపుచ్చుకొని పీటదగ్గర నిలబడి విసర సాగింది. పన్నెండు సంవత్సరాల తర్వాత అతః పురంలో అడుగుపెట్టాడు రాజు. తన అందముతో రాజాంతఃపురాన్నంతా ప్రకాశవంతంచేస్తున్న ఆ బాలికను చూచి రాజు ఆశ్చర్య పోయాడు. ఆపిల్లముఖంలోకిచూస్తూ భోజనంచేయటంకూడా మరచిపోయాడు.

చిట్టచివరికి తన రాణిని అడిగాడు "దేవకన్యకలాగ మెరిసిపోతున్న యీ బాలిక యెవరు? ఎవరిపిల్ల యీామె!"

"నా ప్రారబ్ధం యిలాగుంది! మీ బిడ్డను మీరేగుర్తు పట్ట లేకపోతున్నారా?" అన్నది. తనవిధిని నిందించుకొంటూ; రాజు విస్తుపోయాడు. కొంతసేపటివరకు నోటమాటపెగలలేదు. చివరికి యిలాఅన్నాడు "నా చిట్టితల్లి యెంతపెద్దదయింది.

ఇంకా పెద్దది కాకుండావుంటుందా. మీరు వెళ్ళి అప్పుడే పన్నెండు సంవత్సరాలుదాటిపోయాయని తెలి యదా?" అన్నది రాణి దీర్ఘంగా నిట్టూర్చుతూ.

"అయితే పెండ్లెందుకు జేశావుగావు?" అని రాజు ఆమెను ప్రశ్నించాడు.

"మీరు అరణ్యాలకుపోయి కూర్చుంటిరి. పిల్లకు తగిన వరుణ్ణి నేనెక్కడ వెతుక్కు రాగలను?" అని రాణి జవాబు ఇచ్చింది.

రాజుగారికి వింత ఆవేశంకలిగింది. రేపు అంతఃపురం నుంచి బయటకి రాగానే మొట్టమొదలుగా కనబడ్డ మనిషిని తీసుకువచ్చి తన కూతురుకు వివాహం చేస్తానని శపథం చేశాడు.

రాజకుమార్తె మాత్రం యేమీ అనలేదు. నెమిలిపించపు విసనకర్రతో తండ్రికి విసురుతూ నిల్చున్నది. రాజు భోజనం పూర్తిచేసి లేచిపోయాడు.

మర్నాడు ఉదయాన్నె లేచి రాజు రాజనగరు నుండి బయటికి వెళుతూండగా కోట సింహద్వారం దగ్గర కట్టె పుల్లలు ఏరుకొంటున్న ఒక బ్రాహ్మణబాలుడు కనబడ్డాడు. ఏడెనిమిదిసంవత్సరాల వయస్సువాడాబాలుడు.

"నా కుమార్తెను యితనికిచ్చి వివాహం చేస్తాను" అనుకున్నాడు, రాజు.

రాజు తలుచుకున్న తర్వాత దానికి తిరుగుంటుందా? వెంటనే ఆ పిల్లవాడిని పిలిపించాడు. పూలమాలలు వేయించి తన కుమార్తెకూ, ఆ బాలునికీ వివాహం చేయించి వేశాడు.

ఇలా కథ చెబుతున్న మా నాయనమ్మదగ్గరకు నేను జరిగి అడిగాను "ఆ తర్వాత యేమయింది?"

ఆ కట్టెపుల్లలు యేరుకొనే ఏడుసంవత్సరాల బాలుడు నేనేఅయితే యెంతబాగుండును అని నాహృదయాంతరాళంలో అనిపించింది. నిశ్శబ్దంగావున్న ఆచీకటిరాత్రిలో వానచినుకుల ధ్వనిమాత్రమే వినవస్తున్నది. గదిలోనిదీపం మందంగా వెలుగుతున్నది. కథ చెబుతూవున్న నాయనమ్మ గొంతు సన్నగిలుతూ వున్నది. ఆవాతావరణంలో నేను యెక్కడో

కట్టెపుల్లలు యేరుకొంటున్నట్లనిపించింది. అంతలోనే నేను రతీదేవిలాంటి రాజకుమారితో పూలదండలు మార్చుకొంటున్నాను.

మా నాయనమ్మే గనుక రచయిత్రి అయివుంటే యీ కథకు యెన్నెన్ని సంజాయిషీలు చెప్పుకోనవలసియుండేదో! ప్రతివాళ్ళు మొదటిప్రశ్నగా, ఆ రాజు పన్నెండు సంవత్సరాలల్లా యెందుకు అడవుల్లో వుండిపోయాడని అడుగుతారు. తర్వాత రాజుకూతురు అంతకాలంవరకు యెందుకు వివాహం కాకుండా వుండిపోయిందని అడుగుతారు. అలా అంతకాలం వివాహం కాకుండా ఉండిపోవడం అర్ధరహితమైన విషయంగా కనబడుతుంది పెద్దలకు!

మా నాయనమ్మ తక్కిన యేవిషయాల్లోనూ పేచీలు లేకుండా తనకథను అంతవరకు నడిపించుకు రాగలిగినా పెండ్లి విషయం వచ్చినప్పుడు మాత్రం పెద్ద రాద్ధాంతం జరిగివుండేదే. మొదటివిషయం యేమిటంటే అంతవయస్సు వచ్చేవరకు పెండ్లి జరుగకపోవటం అసాధ్యమైన విషయం. రెండవ విషయం యేమిటంటే క్షత్రియులకూ, బ్రాహ్మణులకు మధ్యవివాహం జరుగుతుందా? ఆమె పాఠకులు ఆమె ప్రస్తుత సామాజిక వ్యవస్థకు వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నదని వెంటనే నిర్ణయించేవారు. పత్రికలకు కుప్పతెప్పలుగా ఉత్తరాలు వ్రాసియుండేవారు.

కాబట్టి మా నాయనమ్మ వేయిజన్మాలకుగూడా నాయనమ్మగానే పుట్టాలనీ, ప్రమాదవశాత్తు నయినా తన

మనమడిలాగ రచయితగా పుట్టకూడదనీ నేను భగవంతుడికి వేయిదణ్ణాలు పెడుతున్నాను.

సంతోషంతో ఉప్పొంగుతున్న హృదయంతో మా నాయనమ్మను మళ్ళీఅడిగాను "ఆ తర్వాత యేమయింది?"

నాయనమ్మ చెప్పటం మొదలుపెట్టింది. ఆ తర్వాత రాజకుమార్తె తన భర్తను తీసుకొని వెళ్ళిపోయింది. ఒక చోట యేడంతస్తుల భవంతి కట్టించి అందులో తన భర్తను పెంచుకొంటూ రాసాగింది.

"ఆ తర్వాత?" అని ఆదుర్దాగా నేను మా నాయనమ్మను అడిగాను.

నాయనమ్మ చెప్పసాగింది: ఆపిల్లవాడు బడికిపోతూ శ్రద్ధగా చదువుకొనసాగాడు. అలా ఆ పిల్లవాడు పెరుగుతూ వుండగా అతని సహాధ్యాయులు అతనిని ఇలా అడిగేవారు— "ఆయేడంతస్తుల మేడలో నీతోపాటువుండే ఆసుందరి యెవరు?"

నిజంగానే ఆమెయెవరో తెలుసుకోవాలన్న కుతూహలం ఆ బ్రాహ్మణబాలుడికి కలిగింది, చిన్నప్పుడు తానొక సారి కోటగుమ్మందగ్గర కట్టెపుల్లలు యేరుకొంటూవుండటం ఆతర్వాత కొంతసందడి జరగటం మాత్రం అతనికి గుర్తు. కాని అది యెంతోకాలంక్రితం జరిగియుండటంచేత స్పష్టంగా యేమీగుర్తులేదు.

ఈవిధంగా నాలుగైదు సంవత్సరాలు గడిచిపోయినవి. అతని సహాధ్యాయులు యెప్పుడూ అడుగుతూనే రాసాగారు. "ఆయేడంతస్తుల మేడలో నీతోపాటువుండే ఆసుందరియెవరు? అని. అదివిని బ్రాహ్మణబాలుడు యింటికి తిరిగివచ్చి విచార

వదనంతో రాజకుమార్తెను అడిగేవాడు—"నా సహాధ్యాయులు ఈ యేడంతస్తుల మేడలో నాతోపాటువుండే సుందరి యెరని యెల్లప్పుడూ అడుగుతుంటారు. వారికి నేనేమీ జవాబు చెప్పలేకపోతున్నాను కాబట్టి నువెవ్వరో నాకు చెప్పు?".

"ఈరోజు పోనివ్వండి. మరొకరోజెప్పుడైనా చెబుతాను లెండి" అని రాజకుమార్తె అందుకు జవాబు చెబుతుండేది. కాని ప్రతిరోజు బ్రాహ్మణబాలుడు "నీవెవ్వరు?" అని అడుగుతూనే వుండేవాడు. అందుకు రాజకుమార్తె, "ఈరోజు పోనివ్వండి. మరొకరోజెప్పుడైనా చెబుతాను లెండి" అని జవాబు చెబుతూ దాటవేస్తుండేది. ఈవిధంగా మరి నాలుగైదు సంవత్సరాలు గడిచిపోయాయి.

చివరికి బ్రాహ్మణబాలుడు సహానంతో ఉండలేక పోయాడు. రాజకుమార్తె దగ్గరికి వచ్చి యిలాఅన్నాడు. "ఓ సుందరీ, నువ్వు ఎవ్వరివో యీరోజున గనక చెప్పక పోయినట్లయితే నేను యీ భవనం విడిచివెళ్ళిపోతాను." అందుకు రాజకుమార్తె జవాబుచెబుతూ—"రేపు తప్పక మీకు చెబుతాను" అన్నది.

మర్నాడు బ్రాహ్మణబాలుడు బడినుంచి తిరిగిరావటంతోటే—"నువ్వెవ్వరో యిక నాకు చెప్పు" అని అడిగాడు. "ఈరోజు రాత్రి భోజనాలైన తర్వాత మీరు పడుకోనబోయే ముందు చెబుతాను" అని అన్నది. రాజకుమార్తె.

బ్రాహ్మణబాలుడు అందుకు అంగీకరించాడు. ఎప్పుడు రాత్రవుతుందా అని ఎదురుచూస్తూ కూర్చున్నాడు. రాజకుమార్తెకూడా పూలపాన్పు తయారుచేసి, సుందరంగా అలం

కరించుకొని ఎప్పుడు రాత్రవుతుందా అని నిరీక్షిస్తూ కూర్చున్నది.

బ్రాహ్మణబాలుడు తనకు రహస్యం తెలియబోతుం దన్న సందడిలో ఆసాయంత్రం అన్నమే సరిగ్గా తినలేదు. భోజనానంతరం తన పడకగదిలోనికి వెళ్ళి పూలపాన్పును చూచాడు. "ఈసుందరి ఎవరో ఈరోజు నాకు తప్పక తెలుస్తుంది" అనుకున్నాడు.

రాజకుమార్తె తన భర్త ఎంగిలి విస్తట్లోనే భోజనం చేసింది. తర్వాత నెమ్మదిగా పడకగదిలో ప్రవేశించింది. ఈ రోజు తానెవ్వరో ఆ బ్రాహ్మణ బాలునికి తెలుపబోతున్నది! ఆవిషయం చెప్పటానికే తన భర్త పడుకొని ఉన్న పూల పాన్పు దగ్గరికి వెళ్ళింది. పాన్పుమీద ఉన్న పూలలోంచి ఒక సర్పంవచ్చి బ్రాహ్మణబాలున్ని కరిచి పారిపోతుండటం కన బడ్డది! ఆరాజకుమార్తె భర్తముఖం వెలవెలబోతూ మృత్యువు కౌగిట్లోకి వెళ్ళిపోతున్నాడు.

హఠాత్తుగా నాగుండె కొట్టుకోటం ఆగిపోయింది. కండ్లలో నీళ్ళు తిరిగాయి. గద్గదస్వరంతో అడిగాను– "ఆ తర్వాత యేమయింది?"

నాయనమ్మ అంటున్నది: "ఆతర్వాత——"

కాని కథ యింకాచెప్పి యేంలాభం? ఇంకా ఇంకా అసాధ్యమైన విషయాల్లోకి పోతుంది కథ. ఏడు సంవత్సరాల బాలుడ్నయిన నాకు చావుతర్వాతగూడా "ఆతర్వాత యేం జరుగుతుంది?" అనే ప్రశ్నలున్నాయని తెలియకపోయినా,

మా నాయనమ్మే కాదు, ఆమె నాయనమ్మకూడా నాటికి జవాబు చెప్పలేదు.

కాని బాలుడి విశ్వాసం అంత తొందరగా ఓటమిని అంగీకరించదు. బడిపంతులు బాధలేని సాయంత్రపు పూట వింటున్న కథ అలా హఠాత్తుగా అంతం కావటం దారుణంగా తోస్తుంది. అందువల్ల నాయనమ్మ తన కథను శాశ్వతంగా మూయబడివుండే మృత్యుమార్గంనుండి వెనుకకు దీసుకు రావలసివస్తుంది. ఆమె ఆ పనిని సులువుగా చేసేస్తుంది. చనిపోయిన బాలుడి శవాన్ని అరటియాకు మీద ఉంచి నదిలో వదిలించివేస్తుంది. ఎవరో ఒక మాంత్రికుడు మంత్రాలు చదివేటట్లుచేస్తుంది. కాని బయట వానకురుస్తూ లోపల దీపపు మసక వెలుగులో కథవింటూ కూర్చొనే బాలుడికి చావు అంటే భయమేకలుగదు. చావు రాత్రిపూట నిద్రపోవుట లాంటిదే అనిపిస్తుంది. కథ ముగిసేటప్పటికి నిద్రాభారంతో కళ్ళు మూసుకు పోతుంటాయి. ఆవిధంగా పసిబాలుడిని మనం నిద్రఅనే ఆకుమీద ఉంచి కాలంఅనే నీటిమీద వదలుతాము, ఉదయాన్నే మంత్రాలు పఠించి సజీవ ప్రపంచానికి మళ్ళీ తీసుకువస్తూవుంటాము.

---

# విషకన్య

బాల్యమిత్రులం ముగ్గురం ఒక గదిలో ఉంటూ ఉండే వాళ్ళం. ప్రక్కగదిలో గోడకి అస్థిపంజర మొకటి వ్రేలా డుతూ ఉండేది. రాత్రిపూట, గాలికి అది ఊగులాడుతూ వుంటే, దాని బొమికెలు ఒకదానికొకటి రాచుకుని చప్పు డవుతూ వుండేది.

ప్రతి ఉదయం, ఆ అస్థిపంజరంలోని ఎముకలను మేము పరీక్షిస్తూ ఉండేవాళ్ళం మేమారోజులలో, ఒక పండి తునివద్ద "మేఘనాధవధ" కావ్యాన్ని, మేం ఒక స్కూలులో చదువుకుంటూవున్న ఒక విద్యార్థివద్ద అస్థివిద్యను అభ్యసిస్తూ ఉండేవాళ్ళం. మా సంరక్షకుని ఉద్దేశ్యమేమంటే, మేము అమాంతంగా సర్వశాస్త్ర పారఃగతులమైపోవాలని! మా సంరక్షకుని అభిప్రాయమూ ఆశలు ఎంతవరకు సఫలమై నాయో, ఆవిషయాన్ని యిచట ముచ్చటించుట అతివ్యాప్తి అవుతుంది; మమ్ముగురించి తెలిసినవారికి చెప్పటం కమ్మరి వీధిని సూదులమ్మటం అవుతుంది; తెలియనివారికి ఆ విష యాన్ని తెలియజేయటంకంటె, దాచిపెట్టటమే మేలు.

చాలారోజులు గడచిపోయాయి. ఈ మధ్యకా లంలో, ఆగదిలోని అస్థిపంజరమూ, మామెదడులోని అస్థి విద్యా, ఎక్కడకు ఎగిరిపోయాయో, కంచుకాగడావేసి వెత కినా అగుపించవు.

కొన్ని రోజులు గడిచినాయి. ఒక రాత్రి ఏదో కారణంవల్లనూ, మరెక్కడా తావు దొరకకపోవటం చేతనూ, నేనాగదిలోనే నిద్రించాల్సివచ్చింది. ఈ గదిలో పడుకునే అలవాటు లేదు అందువలన, నిద్రరావటంలేదు అటూ యిటూ వత్తిగిలి చూశాను. నిద్రపట్టుతుందేమోనని ఆశించాను. సమీపంలో వున్న క్లాక్ టవరు గడియారం, ఒకటి తర్వాత నొకటిగా పెద్దపెద్ద గంటలన్నీ కొట్టివేసింది.

సరిగా ఇదేసమయంలో, గదిలోని దీపం టుపుక్కున ఆరిపోయింది. ఇంతకుపూర్వం, మాయింటిలో ఒకటిరెండు దుర్ఘటనలు సంభవించాయి. దీపం ఆరిపోగానే, మృత్యువునుగురించి, నామనసులో కదలబారింది. రాత్రి సమయంలోని రెండవయామంలో, ఒక దీపం ఆరిపోయి, అనంతమైన అంధకారంలో విలీనమైపోయిందిగదా, యిది అనంత ప్రకృతిలో ఎటువంటి తుచ్ఛఘటనో కదా అని ఆలోచింపసాగాను మానవుల ప్రాణజ్యోతులుకూడా, కొన్ని పగటిపూట, కొన్ని రాత్రిపూట, అకస్మాత్తుగా ఆరిపోతూ ఉంటాయి; విస్మృతి గర్భంలో లీనమైపోతూ ఉంటాయి. ఇదికూడా అలాంటి ఘటనే అనిపించింది.

క్రమక్రమంగా, ఆగదిలో ఉండే, అస్థిపంజరం నామనో రంగాన్ని ప్రవేశించింది. ఆ అస్థిపంజరాన్ని గురించి, ఆలోచింపసాగాను. దానినిగురించి, ఏవేవో భావాలు నా మేధస్సులో మెదలసాగినాయి. అకస్మాత్తుగా సచేతన పదార్థమేదో గోడలను తాకుతూ, నా దోమ తెరచుట్టూ తిరుగుతోందని

పించింది. దాని ముక్కుల్లనుండి వెలువడే శ్వాసయొక్క శబ్దం సుస్పష్టంగా నాకు వినపడసాగింది.

అది దేనినో వెతుకుతోందికాబోలు! ఈప్సిత పదార్థం దానికి లభించలేదు కాబోలు! నిద్రాహీనతవలన నా మెదడు వేడెక్కింది; అందువల్లనే, యిలాంటి కల్పనాతరంగాలు నా మేధస్సులో జనిస్తున్నాయన్న విషయం సుస్పష్టం. కాని, అలా సుదృఢమైన అభిప్రాయం, ఒక మూల కలుగుతూఉన్నప్పటికీ, నా శరీరం, రోమాంచితమైంది. ఈ అకారణభయాన్ని పోద్రోలుకొనుటకుగాను, బలాన్నంతటినీ వినియోగించి, "ఎవ రది?" అని అరచాను.

పాదములధ్వని, నా దోమతెరకు సమీపంగావచ్చి, ఆగిపోయింది. అంతేకాదు.

"నేనే! నా అస్థిపంజరం ఎక్కడకు పోయిందీ? దానిని వెదకుటకు వచ్చాను!" అన్న జవాబువచ్చింది.

నా కాల్పనిక సృష్టిఎదుట భయపడటం గొప్పఅనిపించుకోదు అని భావించాను. దిండును ఒడిలో పెట్టుకొన్నాను. లేచి, మంచంమీదకూర్చున్నాను చిరపరిచితునితో మాట్లాడుతున్నట్లుగా, సహజస్వరంలో యిలా అన్నాను.

"ఇంత రాత్రివేళ, భలే పని ప్రారంభించావ్! కాని, - అయితే, ఆ అస్థిపంజరంవలన నీకు కలిగేలాభం?"

ఆ గాఢాంధకారంలో, అత్యంత సమీపమునుండి యిలా ప్రత్యుత్తరం లభించింది.

"ఏమంటున్నావ్? నా రొమ్ముకు సంబంధించిన ఎముకలు దానిలో ఉన్నాయ్. నా యిరువైయారు సంవత్సరాల

యవ్వనం, ఆ ఎముకలచుట్టూ వికసించింది. అలాంటిదాన్ని ఒక్కసారి చూసుకోవాలనేకోర్కె కలుగదా?"

అందుకు, నేను ఈ విధంగా ప్రత్యుత్తరమిచ్చాను.

"సబబే! మంచిదే! నువ్వు దానిని వెతుక్కుంటూ ఉండు! నేను నిద్రపోవటానికి ప్రయత్నిస్తాను!"

"ఒంటరిగా ఉన్నావా? అయితే, కొంచెంసేపు కూర్చోనా? కొంచెం మాట్లాడుకుందాం? ముప్పై అయిదు సంవత్సరాలకు పూర్వం, నేను మానవులవద్ద కూర్చుని, మానవ భాషనే మాట్లాడుతూ వుండేదాన్ని ఈ ముప్పైఅయిదు సంవత్సరాల కాలంనుండి నేను స్మశాన వాయువులో కలసి ప్రవహిస్తున్నాను. ఈనాడు, నీ ప్రక్కనకూర్చుండి, మరల ఒకసారి, మనుష్యులవలె, మాట్లాడాలనే కోరిక కలిగింది.

నా దోమ తెరవద్ద ఎవరో కూర్చునట్లు అనిపించింది, నాకు మార్గాంతర మేమీ తోచలేదు, ఇక దానికి ఉత్సాహం కలుగజేయాలనే ఉద్దేశంతో యిలాఅన్నాను.

"అదే మంచిది! మనోరంజకంగా ఉండే కథ ఏమైనా చెప్పు"?

ఆమె చెప్పసాగింది.

"అన్నింటి కంటె, మనోరంజకమైనది వినాలనే కుతూహలంఉంటే, నా జీవితగాథనే నీకు చెపుతాను! ఏమంటావ్?"

క్లాక్ టవర్ రెండు గంటలు కొట్టింది ఆ వ్యక్తి యిలా చెప్పసాగింది.

"నేను మానవిగానున్న సమయంలో చిన్నతనంలో,
ఒకవ్యక్తిని చూస్తే యముణ్ణిచూసినంత భయంగా ఉండేది.
ఆవ్యక్తి ఎవరో కాదు, నా భర్తే సుమా! మావివాహం జరిగిన.
రెండు మాసాలకు ఆయన చనిపోయాడు. అప్పుడు, నా
ఆత్మీయులందరూ, చాలాదుఃఖించారు. ఏమేమో అన్నారు.
నా మామగారు, ఏవేవోగుణించి, నా అత్తగారితో యిలా
అన్నారు. "ఒసే శాస్త్రంలో విషకన్య అని చెపుతారే,
అదెవరో కాదు యిదే!" అని నన్ను వేలెట్టి చూపారు!"

"ఆయన ఆరోజున అన్నమాట నాకు యీనాటికి
బాగాగుర్తుఉంది! వింటున్నావా నాగాధ? ఎలావుంది కథ"
అని అడిగింది.

"బాగానే ఉంది! కథాప్రారంభం చాలా బాగుంది!"
అన్నాను.

"అయితే విను!" అని చెప్పసాగింది.

"అమితానందంతో పుట్టింటికి తిరిగి వచ్చాను.
క్రమంగా నాకు వయస్సు వచ్చింది జనం నాకు దూరంగా
ఉండుటకు యత్నిస్తూఉండేవారు. కాని, నావంటి సుందరి
లావణ్యవతి మరెవ్వరూ లేరు, నీ అభిప్రాయ మేమిటి?
ఏమంటావ్?" అని అడిగింది,

"ఆఁ అవును! నీవు అలాంటిదానివేఅయి ఉండవచ్చు!
ఇలా ఎందుకంటున్నానంటే, నేను నిన్ను చూడలేదుగా!
అన్నాను.

"చూడలేదూ?" అని రెట్టించింది, నా ఆ అస్థిపంజ
రాన్ని చూడలేదూ? కాని, నేను వేళాకోళంగా అంటున్నా

నులే! నీవు ఎలా చూచివుంటావనుకుంటాను! కాని – ఆ కనుగ్రాండ్లలో, చెంపకు బారడేసి కళ్ళు – నల్లని కళ్ళుండేవని ఎలా నిరూపించగలను చెప్పూ! నాకు, దొండపళ్ళలాంటి పెదవులుండేవి! ఆ పెదవులపై చిరునవ్వు చిందులాడుతూ ఉండేది! పండిన దానిమ్మగింజలవంటి పలువరుస ఉండేది. చంద్ర బింబంవంటి నాముఖంలో, పెదవులపై వికటహాస్యం నాట్య మాడుతూఉండేది నా లావణ్యానికి నేనేసాటి! నా అందానికి దీటైన వనిత ఆ కాలంలో మరొకతెలేదు! ఆ ఎముకలను ఆవృతించియున్న ఆనాటి, లాలిత్యాన్ని, లావణ్యాన్ని, పూర్ణ యవ్వనశోభను వర్ణించ నెవరితరం? ఆ లాలిత్యం, లావణ్యం, యవ్వనం, ప్రతిరోజూ ప్రవర్థమానం కాసాగినాయి. ఆ విష యం, నేనిప్పుడు చెప్తూవుంటే, నాకు నవ్వూ వస్తోంది, క్రోధమూ కలుగుతోంది!" అని చెప్పింది.

"నాశరీరం, అస్థివిద్యను గరపుటకు వినియోగిస్తారన్న విషయం, ఆ కాలంలో, పెద్ద పెద్ద డాక్టర్లే నమ్మలేదు. ఒక డాక్టరు, తన సన్నిహిత స్నేహితునితో, నన్నుగురించి, కనక చంపా పుష్పంగా వర్ణించాడన్న విషయం నాకు తెలుసు! అతడావిధంగా వర్ణించాడంటే దాని అర్థం ఏమిటో తెలుసా? ఈ జగత్తులోని, యీ మానవలోకంలోని, మానవుల శరీరా లన్నీ, అస్థివిద్యకు, శరీరతత్వాలకు పరిశోధన సాధనాలు, స్థలాలు! సౌందర్యరూపిణియైన పుష్పాన్ని కేవలం నేనొక్కతెనే! సువర్ణ, చంపా పుష్పంలోపల అస్థిపంజరం ఉంటుందా?" అని అడిగింది.

మరల, చెప్పసాగింది.

"నేనారోజుల్లో నడుస్తూవుంటే ఎలాఉండేదో తెలుసా? మహామాణిక్యాన్ని చేతిలో పుచ్చుకొని ఊపుతూవ్రుంటే, మహోజ్వలకాంతి వెలువడుతూఉంటుంది. అలాగే ఉండేది నేను నడుస్తూఉంటే! నేను నడుస్తూ, ఆ నడకలో, ప్రత్యేక మైన వయ్యారం, సౌందర్యం, స్వభావసిద్ధంగా ఉండేవి. నేను అప్పుడప్పుడు నా రెండు చేతులను చూసుకుంటూవుండేదాన్ని. అతిసాధారణమైన చేతులుకావు; కమలాలు. నా కరకమ లెటువంటివి! ఈ ప్రపంచంలోని, పీఠాధిపతులందరికి నోళ్ళకు కళ్ళెములు తగిలించి, మధురభావంతో, ఆ కళ్ళెములను చేత పుచ్చుకొని, వారందరినీ నడిపింపగలిగిన కరాలవి!"

"కాని, లజ్జారహితమైన అవలంబన రాహిత్యమైన, చిరవృద్ధమైన నా అస్థిపంజరం, నాకు విరుద్ధంగా, సాక్ష్యమిచ్చి వేసింది! ఉపాయరహితనైపోయాను;నిరుత్సురాలినైపోయాను! అందువలన, యీ ప్రపంచంలో అందరిమీదకన్న నీమీద కోపం వచ్చింది! షోడశవర్షినగు ఆనాటి నా యవ్వనోజ్వాల, యవ్వనతాపముచే సంతప్తమైన, ఆ రక్తమైన, రూపలావణ్యాలను, నీ నేత్రాల ఎదుట నిలబెట్టి, నీకు చూపాలనిపిస్తోంది! నీ నేత్రాలను ఆవృతించిన నిద్రామేఘాలను ఉద్ధూతము గావించాలనిపిస్తోంది! నీ అస్థివిద్యా పాండిత్యాన్ని సమూలంగా పెరికివేయాలనిపిస్తోంది!" అన్నది.

అందుకు నేనిలా అన్నాను–

"ఇదిగో! నీకే ఇప్పుడు ఆశరీరం ఉన్నట్లయితే, దానిని స్పృశించి, నాకు యిప్పుడు, ఆ అస్థివిద్య ఏమాత్రం గుర్తు లేదని చెప్పేవాణ్ణి! అంతేకాదు. భువనమోహనమైన నీ

రూపం, అంధకారవస్త్రంపై జ్వాజ్వల్యమానమై విరిగిపడింది! ఇంతకంటె అధికంగా చెప్పనవసరంలేదు!" అన్నాను.

ఆమె ఇలా అన్నది –

"నాకు స్నేహితురాలెవరూ లేరు! తాను వివాహమాడనని మా అన్న ప్రతిజ్ఞ చేశాడు. అంతఃపురంలో నేను ఏకాకిగా ఉండాల్సివచ్చేది తోటలోని చెట్టుక్రింద కూర్చుండేదాన్ని: ఆసమయంలో నా హృదయం గర్వోత్తుంగ తరంగమవుతూ వుండేది. ఈ ప్రపంచమంతా నన్ను ప్రేమిస్తోందని భావించేవాన్ని, ఆకాశంలో నక్షత్రాలు నా సౌందర్యాన్నే చూస్తున్నాయని తలచేదాన్ని. సమీరుడు నన్ను చూడగనే, ప్రవహిస్తున్నాడనీ; నన్నుజూచి, దీర్ఘ నిశ్వాసాలను విడుస్తున్నాడనీ భావించేదాన్ని. నేను, ఏ మెత్తని పచ్చికపై పాదాలుపెట్టి, దానినే ఆసనంగాగాని, కూర్చుంటే, దానికిదివరలో చేతనత్వమనేదేమైనా వుంటే, నాస్పర్శసుఖానుభూతివలన మత్తిల్లి, అది, అచేతనంగా తయారైపోతుందని భావించేదాన్ని."

"ఈ ప్రపంచంలోని పురుషులందరూ తృణరూపాన్ని ధరించి, నిస్సబ్బద్ధులైనా చరణకమలాలను పూజిస్తున్నారని తలపోసేదాన్ని. ఈవిధంగా, అనూహ్యమైన, అనుపమమైన, కల్పనలను గావించుకుంటూ, భావనాజగత్తులో విహరిస్తూ, అనుపమ ఆనందాన్ని, అనిర్వచనీయమైన, అవ్యాజమైన మధురవేదనను అనుభవిస్తూ వుండేదాన్ని!"

"ఈవిధంగా కొన్నాళ్ళు మధుర స్వప్నసంచారం చేయసాగాను. మాఅన్నయ్యకు ఒక మిత్రుడున్నాడు.

అతనిపేరు శశిశేఖరుడు. ఆయన వైద్యవిద్యలో పట్టభద్రు డయినాడు. వెంటనే ప్రాక్టీసు ప్రారంభించాడు. మాకు గృహవైద్యుడుగా కుదిరాడు మా యింటి వైద్యుడుగా అతడు కుదురకపూర్వమే, మాయింటికి వస్తూవుండేవాడు. అతణ్ణి చాటుగా చూస్తూ ఉండేదాన్ని. మా అన్నయ్యది అద్భుత ప్రకృతి. ప్రపంచాన్ని పూర్ణదృష్టితో చూచే అల వాటు మా అన్నయ్యకులేదు. లౌకికదృష్టి కొరవడినవ్యక్తి మా అన్న. ఆయనకు యీ ప్రపంచకంలో నివశించటానికి తావులేదు కాబోలు అన్నట్లు, వచ్చివచ్చి, యీప్రాంతంలో ఆశ్రయాన్ని పొందాడు!"

"మా అన్నగారికి స్నేహితులుకూడా చాలా తక్కువ మందే! అసలు లేరనే చెప్పవచ్చు. శశిశేఖరుడుతప్ప మరె వ్వరు ఆయనకు మిత్రులు లేరనే చెప్పవచ్చు. అందువలన, మాయింటికి వచ్చేవ్యక్తి ఒక్క శశిశేఖరుడే! తన్మూలంగా, బయటియువకులతో నాకు పరిచయభాగ్యం కలిగే అవకాశం లేకపోయింది. శశిశేఖరుని మాత్రమే యెక్కువగా చూడ గలిగేదాన్ని

"వింటున్నావా ? సంజకెంజాయలో పువ్వుతరుశాఖా దులక్రింద మహారాణివలె పుష్పసింహాసనాన్ని అధిష్టించిన సమయంలో, అపరరతీదేవివలె భాసిల్లుచున్న నాయెదుట, ఈ పృధ్విలో గల పురుషులందరు, శశిశేఖరునిగా మూర్తిభ వించి, చేతులు కట్టుకొని నిలబడేవారు. వింటున్నావా? నేను చెపుతున్నవిషయం ? ఏమాలోచిస్తున్నావ్?" అని ప్రశ్నిం చింది.

అందుకు నేనిలా అన్నాను.

"ఏమని ఆలోచిస్తున్నానంటావా? నేనే ఆ శశిశేఖరుణ్ణయితే ఎంత బాగుండేదీ! చాలా బాగుండిపోనుకదా! అని పిస్తోంది!"

"సరేలే! ముందు నాకథంతావిను!" అని చెప్పసాగింది.

"ఒక రోజున, కారుమబ్బులు ఆకాశాన్ని ఆచ్ఛాదించినాయ్. ఆరోజుననే నాకు జ్వరం వచ్చింది. డాక్టర్ శశిశేఖరుడు నన్ను చూచుటకు వచ్చాడు. మేమిద్దరం ఒకరినొకరు చూచుకోవటం అదే మొదటిసారి!"

"నేను కిటికీవైపుగా తిరిగి పడుకున్నా. నేనలా ఎందుకు పడుకున్నానంటే, సంజకెంజాయ, నాముఖమండలంపైపడి, నా ముఖమండలాన్ని పరివృతించియున్న వివర్ణతను పారదోలాలనే. శశిశేఖరుడు వచ్చాడు. నా ముఖాన్ని పరిశీలించాడు. అప్పుడు నాలో పెల్లుబుకిన భావమేమిటో తెలుసా? నన్ను నేను డాక్టరుగా భావించుకొని, నా ముఖాన్ని పరిశీలించుకో సాగాను. ఆ నాడు నాలో జనించిన భావపరంపరలను విని పిస్తానువిను!"

"సంధ్యాకాలంలో, హంసతూలికాతల్పంపై కొంచెము క్లిష్టకుసుమపేలవమైన ముఖం ఒకటి ఉంది! అసంయమితమైన చూర్ణకుంతలములు లలాటముపై పడుతున్నాయి ఆ నమితమైన విశాలనేత్రాలుగల మృదు కపాలముపై సంజకెంజాయ కాంతులు విహరిస్తున్నాయ్! వింటున్నావా?"

"ఆఁ వింటున్నా!"

"శశిశేఖరుడు, నమ్రతాపూర్వకంగా, మృదుమధుర కంఠస్వరంలో అన్నయ్యతో యిలా అన్నాడు. "ఒకసారి, చెయ్యి చూడాల్సివస్తుంది!"

"నేను కుసుమకోమలమైన చేతిని పైకెత్తాను. ఒక్కసారి నా చేతిని చూచుకున్నా. ఈ చేతులకు నీలిరంగు గాజులుంటే, ఎంతబాగా ఉంటుందీ! అనిపించింది! రోగియొక్క నాడిని పరీక్షిస్తున్న సమయంలో, శశిశేఖరుడు యీ గాబరా పడినంతగా, మరెన్నడూ పడివుండడేమోననిపించింది! అత్యంత అసంలగ్న భావంతో, వణకుతున్న వ్రేళ్ళతో, నాడిని పరీక్షింపసాగాడు! అతడు, ధర్మామీటరుతో, టెంపరేచరుచూశాడు. ఆసమయంలో, అతని అంతర్నాడి ఎంత వేగంగా కొట్టుకుంటున్నదీ నాకు బోధపడింది. నీకు నమ్మకం కలుగుటలేదా ?" అని ప్రశ్నించింది.

అందుకు నేనీ విధంగా జవాబుచెప్పాను.

"నమ్మకపోవటానికి కారణం ఏమీ అగుపించటంలేదు. మనుష్యుని నాడి ఎల్లప్పుడూ ఒకేరకంగా కొట్టుకోదు!"

మరల, ఆమె చెప్పసాగింది.

"ఈ విధంగా రెండు మూడుసార్లు జబ్బుపడ్డాను. ఆరోగ్యాన్ని పొందాను. నాకు, దీనినిబట్టి అర్థమయ్యిందేమిటి ? నేను భావించుకున్నదేమిటి ?"

"ఆనాటి సంధ్యాసమయంలో, నా మానససభలో, కోట్లాది పురుషులు ఒకేఒక పురుషమూర్తిగా రూపొంది, నా కొలువునకు వచ్చారు! ఈ ప్రపంచమంతా, అందువలన,

పట్టిపోయియుంటుంది; పురుష శూన్యమైపోయి యుంటుంది! అనిపించింది. ఇదే ఆనాటి నా భావనాతరంగం!

ఆ నాటినుండి, నేను రహస్యంగా, ప్రతిరోజూ, వసంతపురంగు చీరను ధరించసాగాను. చక్కగా తల దువ్వుకునేదాన్ని. పువ్వులతో చక్కగా అలంకరించుకునేదాన్ని. ఒక అద్దం పుచ్చుకొని, తోటలోనికి వెళ్ళి కూర్చుంటూ వుండేదాన్ని! వింటున్నారా?"

"ఆఁ వింటున్నా!"

"ఎందుకు! అద్దంలో నన్ను నేను చూచుకొనేదాన్ని. అలా చూచుకోవటంవలన, సంతృప్తి కలుగదా? యదార్థానికి చాలా సంతృప్తి కలుగుతుంది! ఎందుకంటావా? చెపుతావిను!

"ఆసమయంలో, నన్ను నేను చూసుకునేదాన్ని కాదు! మరెవ్వరని చూచేదాన్ని?

"నేను రెండు ప్రాణులుగా విడిపోయేదాన్ని! నేను డాక్టరును—అంటే శశిశేఖరుణ్ణి – అని సంభావించేదాన్ని! డాక్టరు దృష్టితో నన్ను చూచుకునేదాన్ని. నన్ను నేను ప్రేమించుకునేదాన్ని! ఇంకేవేవో మధురాతిమధురమైన కల్పనలు గావించుకునేదాన్ని. కాని, – లోలోపల – నాహృదిలో – సంధ్యానిలయమువలె – ఒక దీర్ఘనిశ్వాసం ప్రవహిస్తూ ఉండేది!

"ఈవిధంగా ద్విభావజగత్తులో ద్వివేషాన్ని ధరించుట నేర్చుకున్న నాటినుండి, నేను ఒంటరిదాన్ని కాదు. వింటున్నావా?"

"ఆఁ వింటున్నా!"

"నేను నడుస్తూవుంటే, నతనేత్రినై, నా కాలి వ్రేళ్ళను చూచుకునేదాన్ని! నా కాలి వ్రేళ్ళు డాక్టరుగారికి ఎలా వుంటాయ్? అనుకునేదాన్ని!

"మధ్యాహ్న సమయంలో, తెల్లని దుప్పటిని పరచి పక్క వేసుకునేదాన్ని! దానిపై పడుకునేదాన్ని. అలాంటి సమయంలో, ఒక చేతిని పైకెత్తి యిలా సంభావించేదాన్ని.

"నా ఈ చేతిని యీ భంగిమలో ఉండగా, ఎవరో చూశారట! రెండు చేతులతోనూ, వారు, నా చేతిని పట్టుకొని, చుంబించి, వెళ్ళిపోతున్నారట!—యిదే నా కథకు చివరిభాగంగా భావించి, ఎలావుంటుందో చెప్పు!"

అందుకు నేనిలా జవాబు చెప్పాను.

"ఇందులో చెడుపేముంది? చెడుపేమీ లేదుకాని— కథ కొంచెం, అసంపూర్ణంగా ఉండిపోకతప్పదు!—దేనిని గురించి, బాగా ఆలోచించి, ఆలోచించి, అలసిపోతూవుంటే మిగిలినరాత్రి కాస్తా అయిపోక తప్పదు!—కాని, కథమాత్రం గంభీరంగా వుంటుంది. — కాని, ఉపసంహారానికి తావెక్కడ?"

"ముందు కథవిను! అటుతర్వాత ఏమి జరిగిందంటే, యిలా కొన్ని దినాలు గడిచినాయి. డాక్టరు శశిశేఖరుడు, మామేడ క్రిందిభాగంలో తన వైద్యాలయం తెరచాడు. అప్పటినుండి మాయిద్దరిమధ్య పరిచయం ఘనిష్టరూపాన్ని ధరించింది. అప్పుడప్పుడు, నవ్వుతూనవ్వుతూ— డాక్టరుగారూ! మానవుడు సహజమైన చావు చావాలంటే సులభ మార్గమేమిటండీ? అని అడిగేదాన్ని. ఏయే విషాలు ఎలా పనిచేస్తాయో అడిగి తెలుసుకుంటూ ఉండేదాన్ని! వైద్యానికి,

ఔషధాలకు సంబంధించిన విషయమేదైనసరికి ఆముఖం విప్పా లేది. ఆయన అనేకరకాల విషయాలు చెపుతూ వుండే వాడు.

"ఆసమయంలో, నాకెలా అనిపించేది? వినగావినగా, —ఏమనిపించిందో తెలుసా? మృత్యువు నాకు సుపరిచితమైన ఆత్మీయుడులాగున అనిపించసాగింది!

"ప్రేమ—మృత్యువు—అంతే! ఈ రెండే నాకీ ప్రపంచమంతటిలోను అగుపించసాగినాయ్! వింటున్నావా?"

"ఆఁవింటున్నా!"

"నా కథ పూర్తికాబోతోంది. ఇక ఎంతోలేదులే!"

"చెప్పు! రాత్రికూడా యింకా ఎంతోలేదులే!" అని మెల్లగా అన్నాను.

"కొన్ని రోజులనుండి, — డాక్టరు అన్యమనస్కుడై వుండుటను గమనించాను. ఎప్పుడు చూచినా, దిగులుగా వుండేవాడు. ఇలా కొన్నిరోజులు గడిచినాయ్.........

"ఒకనాడు, ఆయన, టాకుటీకుగా దుస్తులు ధరించాడు. చెప్పులు ఎరువుయివ్వవలసిందిగా అన్నయ్యను అడిగాడు. అన్నయ్య యిచ్చాడు. ఆరాత్రి తాను ఎక్కడికో వెళ్తున్నట్లు అన్నయ్యతో చెప్పాడు!

ఇక నేను ఉండబట్టలేకపోయాను. నేను అన్నయ్య వద్దకు పోయాను. అవీయివీ ఏవేవో కబుర్లు చెప్పిన తరు వాత,—అన్నయ్యా! డాక్టరుగారు ఎక్కడకు పోతున్నారే మిటి?—అని అడిగాను!"

"చావటానికి—" అని అన్నయ్య జవాబు చెప్పాడు.

"నిజంగానా? లేదు! లేదు! నిజం చెప్పు అన్నా! అన్నాను."

"అప్పయ్య మొఖటిసారికంటె విపులంగా చెప్పాడు— పెళ్ళి చేసుకోటానికి. అని"

"నిజంగానా? అన్నాను. అని నవ్వసాగాను."

"మెల్లమెల్లగా సంభాషణలో—డాక్టరుగారికి, యీ వివాహంద్వారా పన్నెండువేలరూపాయలు కట్నం లభిస్తుం దని తెలిసింది!"

"ఈవిషయాన్ని నాకు తెలియకుండా యీ డాక్టరు దాస్తాడా? నన్ను అవమానపరుస్తాడా! ఇతని ఉద్దేశ్యమేమిటి? నేను, ఆయన కాళ్ళమీదపడి, మీరు యీవిధంగా వివాహం చేసుకొనుటకు తలపెట్టితే నేను చచ్చిపోతాను! ఈ వివాహం చేసుకోవద్దు! అని యేమయినా యీయనగార్ని ప్రార్థేయపడ్డానా? పురుషుల నమ్మరాదు! యీ ప్రపంచంలో, ఒకేఒక పురుషుణ్ణి నూశాను! ఒక్క క్షణంలో పురుషుల నైజాన్ని అవగతం చేసుకోగలిగాను!"

"డాక్టర్ శశిశేఖరుడు రోగులను చూచి, సాయంత్రా నికి యింటికి తిరిగివచ్చాడు. అతణ్ణి చూచి, నవ్వుతూ నవ్వుతూ - డాక్టరుగారూ! యివ్వాళ మీ వివాహమా?" అని ప్రశ్నించాను.

"నాప్రశ్నకు శరఘాతంతిన్న లేడిపిల్లలాగున అదరి పడ్డారు డాక్టర్! హతబుద్ధిలాగున నిలబడిపోయాడు; అంతే కాదు; అతని ముఖం వివర్ణమొంది!"

"బాజాలువాజాలు ఏమీలేవా ఏమిటి? అని ప్రశ్నించాను!

"అదివిని, డాక్టరు, - కొంచెం ఊపిరిపీల్చి - పెళ్ళి వ్యవహారం, ఏమంత ఆనందదాయకమైనదికాదులే!" అన్నాడు.

"అదివిని, కడుపుచెక్కలయ్యేటట్లు నవ్వాను. ఎందువల్లనంటే, నే నెన్నడూ అలాంటిమాట వినలేదు. అప్పుడు, నేనిలా అన్నాను. బాజాభజంత్రీలు తప్పకుండా ఉండాల్సిందే. తాళల మేళాలతోపాటు, లైట్లుకూడా ఉండాలి!"

"నేను అన్నయ్యవద్దకు వెళ్ళాను. పెళ్ళికి తప్పకుండా బాజాలు ఉండాల్సిందే, అని మొండిపట్టుపట్టాను. అన్నయ్య ఒప్పుకోకతప్పలేదు. ఏమేమి మేళాలుఉండాలో ఆలోచించసాగారు."

"వాళ్ళిద్దరూ ఏవేవోమాటలు చెప్పుకోసాగారు."

"నేను మాటలసందర్భంలో, డాక్టరుగార్ని యిలా అడిగాను - డాక్టరుగారూ! మీ భార్య వచ్చినతరువాత కూడా, రోగుల నాడులనుచూస్తూ తిరుగుతూవుంటారా?"

"మానవుల మనస్సు అనేది మన కంటికి అగుపడే వస్తువుకాదు. అయినప్పటికి, నేను ఒక్క విషయాన్ని మాత్రం ఖచ్చితంగా చెప్పగలను. అదేమంటే, నేను విసరిన విసురు డాక్టరుగారి గుండెల్లో బల్లెంలాపోయి గుచ్చుకుంది!"

"లగ్నం, రాత్రిపూట అని నిశ్చయించారు. పెద్దలు. రాత్రికి పెళ్ళి అనగా ఆనాటి సాయంత్రం డాక్టరుగారు, మా అన్నయ్య, యిద్దరు మద్యాన్ని సేవింపసాగారు. మద్యపానం

యిద్దరికీ అలవాటే. మెల్లమెల్లగా చందమామ పైకి వస్తు న్నాడు."

"నేను నవ్వుతూ నవ్వుతూ – డాక్టరుగారూ! మీకు యాత్రాసమయం ఆసన్నమైనదన్న విషయం మరచారా? అన్నాను!"

"ఇక్కడ ఎక్కువగా చెప్పాల్సిన అవసరంలేదు. వాళ్ళి ద్దరూ మాట్లాడుకుంటున్న సమయంలో, దొంగచాటుగా వెళ్ళి ఒకపొడి తీసుకొనివచ్చాను. ఆ పొడిని. ఎవరికీ తెలియకుండా డాక్టరుగారి, మద్యపు గ్లాసులో కలిపాను. ఏ విషాన్ని యిచ్చే టట్లయితే మనిషి చస్తాడో, దానిని గురించి, విపులంగా డాక్ట రుగారివద్ద యిదివరకే నేర్చుకొనివున్నాగా!"

"డాక్టరు, తన గ్లాసులోని సారాను ఒకటి రెండు గుక్కలు తాగాడు. కొంచెం గాద్గదికంగా, మర్మాంతక దృష్టితో నన్ను చూస్తూ – అయితే, వెళ్తున్నా? – అన్నాడు!"

"మురళి మోగసాగింది. నేను బనారసుచీర ధరిం చాను. నా నగలన్నీ ధరించాను. పాపటలో సింధూరాన్ని ధరించాను. వకుళలతానికుంజంలోనికి వెళ్ళి, పక్క వేసు కున్నాను."

"చక్కని రాత్రి అది – పున్నమి వెన్నెల – సుప్త జగత్తుయొక్క క్లాంతిని హరిస్తూ, దక్షిణ పవనం వీయసాగింది. పూలవాసనతో తోట అంతా నిండిపోయింది.

"మురళీమోహన గానం దూరమవుతున్న సమయ ములో వెన్నెల అంధకారంలో లీనమవుతున్నప్పుడు పృధ్వి

మాయమవలె అదృశ్యమవుతున్నప్పుడు, నిమీలిత నేత్రనై నవ్వే సాగాను.

"జనం వచ్చి చూచినప్పుడు, అప్పుడు నవ్వీన నవ్వు అలాగే వుండిపోవాలని, నాకోరిక. మెల్లమెల్లగా అనంత రాత్రిలో శోభనపుగదిలోనికి పోయినప్పుడుకూడా ఆ చిరు నవ్వునే పెదవులపై కలిగియుండాలని నాకోరిక. కాని, ఆ గది ఎక్కడ? నా వివాహవేష మెక్కడ! నాలో కటకటశబ్దం విని, నిద్రమేల్కొన్నాను! నన్ను తీసుకొని, ముగ్గురు బాలురు అస్థి విద్య నేర్చుకుంటున్నారు!

సుఖదుఃఖాలు ధగధగలాడే స్థానంలో, నా హృదయ స్థానంలో, యవ్వన పుష్పాలు వికసించే ఆ స్థానంలో, ఒక బెత్తాన్ని గుచ్చి, ఒక ఉపాధ్యాయుడు అక్కడవుండే ఏదో బొమికెను గురించి, బోధిస్తున్నాడు. ఆ అంతిమ మందహాసం – నా పెదవులపై ఆనాడు తాండవించిన మృదుమందహాసంయొక్క చిహ్నం చూచావా?............

"కథ ఎలావుంది?"

"చాలా బాగుంది!" అన్నాను.

అదే సమయంలో తొలికోడి కూసింది – "ఇంకా ఉన్నావా? ఏమైంది?" అని ప్రశ్నించాను – జవాబు రాలేదు.

ప్రభాతలోకనము గదిలో ప్రవేశించింది.

---

6)

# పరిష్కృతి

ఝింకడాకోటజమీంకి కృష్ణగోపాల సర్కారు, జమీం దారు: ఆయన, తన పెద్దకుమారునకు తన జమీని వప్పగించాడు. పరివార రక్షణభారాన్నికూడా వప్పగించి, తాను కాశీకి పోయాడు. ఆయన కాశీకి వెళ్ళుతూవుంటే, గ్రామం లోని బీదవారందరూ చాలా దుఃఖించారు. కారణమేమంటా రేమో, ఆయనలాంటి, దయాళువు, ధర్మాత్ముడు, దాత, ఈ కలియుగంలో ఉండటం, అసంభవమని, ఆ గ్రామంలోని పేదవారి అభిప్రాయం.

కృష్ణగోపాలుని తనయునిపేరు విపినబాబు. ఆధునిక యుగానికి జెందినమనిషి. బి. ఏ. ప్యాసైనాడు. అతనిది, చూడ ముచ్చటైన గడ్డం; కళ్ళకు రంగు అద్దాలు తగిలిస్తాడు. ఎవరి తోనూ అనవసరంగా, అపరిమితంగా పరిచయం కలిగించుకోడు; మితభాషియనే చెప్పవచ్చు. దుర్వ్యసనాలేమీలేవు. ఆఖరికి చుట్ట, బీడీ, సిగరెట్‌లలో, ఏదీ దగ్గరకు రానీయడు. చీట్లపేక ఆడడు. అతనిముఖంచూస్తే, చాలా సచ్చరిత్రుడులాగున కన పడుతాడు. కాని, మాటలతీరు, మనిషిపోకడ చాలా కఠినంగా వుంటాయ్.

అతని తత్వం ప్రజలు చాలా త్వరలోనే అర్థం చేసు కున్నారు. వృద్ధజమీందారును ఏవో మాటలుచెప్పి మభ్య పెట్టడం తేలిక. కాని, విపినబాబు విషయంలో అది చలామణీ

కానటంలేదు ప్రజలు ఎన్నిరకాలుగా ఏడ్చినా, మొత్తుకున్నా, ఎంతయుదిగా తమ కష్టనష్టాలను మొరపెట్టుకున్నా, విపినబాబు ఒక్క పైసయినా, తనకురావలసిన పంటలోగాని, శిస్తులో గానీ, బాకీలోగానీ, తగ్గించడు. వాయిదానాటికి, సరిగా తీసుకొచ్చి డబ్బు చెల్లించారా సరేసరి, లేకపోతే, వారితాళం పట్టించాడన్నమాటే!

విపినబాబు, తన జమీా వ్యవహారాలన్నింటినీ తనిఖీ చేయసాగాడు. తనతండ్రి అనేకమంది బ్రాహ్మణులకు భూమిని దానంచేశాడని, దానిమీాద శిస్తువసూలు హక్కు అయినా ఉంచుకోలేదనీ, విపినుడు గ్రహించాడు. ఎంతమందికి, ఎంత శిస్తు మాఫీచేశాడో వాటి లెక్కలైనా ఉన్నాయా అంటే అవీ లేవు.

వృద్ధ జమీాందారువద్దకు ఎవరైనా వచ్చి, చెయ్యి చాపితేచాలు, లేదనకుండా ఆయాచకునకు యిచ్చిపంపేవాడు. యదార్థానికి ఆయనచేతికి బొమికె లేదనేచెప్పాలి. అపర దాన కర్ణుడనే చెప్పాలి. ఇదే వృద్ధజమీాందారుని స్వభావం.

తండ్రిగారియొక్క యీాదాతృత్వలక్షణం, విపినబాబు కేమాత్రం నచ్చలేదు. ఆ సాంప్రదాయానికి స్వస్థి చెప్పదలచారు విపినబాబు.

"ఇలా జరుగరాదు. జమీాలో సగభాగంమీాద శిస్తు వసూలు చేసుకునే హక్కుమాత్రమేనా? ఇలా జరుగరాదు. ఏమైనాసరే జమీానంతా స్వాధీనం చేసుకోవాల్సిందే!" అనుకున్నాడు విపినుడు.

ఆలోచించగా, ఆలోచించగా, ఆయనకు రెండు అభిప్రాయాలు తట్టినాయి. అందులో మొదటి దేమంటే, "పనీపాటలు లేకుండా, యింట్లో కూర్చుని, ఫలసాయాన్ని సుఖంగా అనుభవిస్తున్నారు కొందరు. ఇలాంటివాళ్ళకు దానం ఇవ్వటం శుద్ధతప్పు. వీళ్ళు దానానికి అర్హులేమాత్రం కాదు. ఇలాంటివాళ్ళకు దానం యివ్వటమంటే, సోమరితనాన్ని పెంచటంమాత్రమే అవుతుంది! ఇలాంటివాళ్ళను అదుపులో పెట్టాలి!"

ఇక రెండవ దేమంటే, "తాతలనాటి కాలపు జీవితానికీ, యీనాటి జీవితానికి ఎంతో వ్యత్యాసముంది. ఈనాటి జీవితం, కష్టంగానూ, క్లిష్టంగానూ, సంస్లిష్టంగానూ వుంది. ఈనాడు, జీవితాన్ని జాగ్రత్తగా వెళ్ళదీసుకోవాలంటే, తాతలనాటి కాలంకన్న నాలుగురెట్లు ఎక్కువ వెచ్చించాల్సి వస్తోంది. నాన్నగారు భవిష్యత్తును గురించి, ఏమాత్రం ఆలోచించకుండా, రెండుచేతులతోను దానాలు ధర్మాలుచేసి పారేశారు. ఈనాడు ఆయనమూలంగా పోగొట్టుకున్న వాటిని తిరిగి సంపాదించుటే ప్రథమ కర్తవ్యం!"

విధ్యుక్తధర్మం, తనకు బోధించిన దానిని, విపినుడు ఆచరణలో పెట్టసాగాడు. అతడు ఒక లక్ష్యాన్ని నిర్ణయించుకొని, పని ప్రారంభించాడు. ఆ లక్ష్యసాధనంకోసం, కదనరంగంలోనికి దుమికాడు.

విపినుడు సాధకుడు. అతని సాధనఫలితంగా, తండ్రి కాలంలో యింటినుండి బయటకుపోయిన వస్తువులన్నీ క్రమక్రమంగా తిరిగి రాసాగినాయి. తండ్రి ప్రతియేటా యిస్తూ

వుండే దానధర్మాల సంఖ్యను చిత్రికపట్టాడు. కొన్నింటిని మాత్రమే మిగిల్చాడు. వాటికికూడా, స్థిరత్వంలేకుండా పోయింది. విపినుడు, అతి తెలివితేటలుగా, క్రమక్రమంగా, తన రాజ్యాంగ చక్రాన్ని బిగించసాగాడు.

మాజీ జమీందారైన కృష్ణగోపాలుడు, కాశీలో కూర్చుండి, జాబులద్వారా తన ప్రజలగోడును వింటున్నాడు. కొంతమంది కాశీకిపోయి, కుమారుని దుశ్చర్యలను తండ్రికి విని పింపసాగారు. ఆయనపాదాలపైపడి గోడుగోడున ఏడ్వసాగారు. ప్రజల మొరవిని, కృష్ణగోపాలుడు గోపాలుడు, "యిది మంచి పనికాదు కుమారా!" అని మందలిస్తూ జాబువ్రాశాడు.

ఆ జాబుకు జవాబుగా విపినుడు, యిలా వ్రాశాడు.

"నాన్నగారూ! పూర్వం మీరు దానధర్మాలు చేశారంటే, ఆకాలంవేరు; ఆసంగతివేరు; ఆదాయంకూడా అలాగే వస్తూవుండేది. ఆరోజులలో, జమీందారుకు, ప్రజలకు మధ్యదానప్రతిదానాలు జరుగుతూ ఉండేవి. ఇస్తే వాయనం, పుచ్చుకుంటేవాయనంగా ఉంటూ ఉండేవి. ఆనాటి సంబంధాలు అలాంటివి. ఈనాటి వ్యవహారమంతా మారిపోయింది. క్రొత్తక్రొత్త శాసనాలు వచ్చిపడ్డాయి. కొలుతప్ప, చిట్టెడు గింజలయినా అదనంగా తీసుకోటానికి, ఏమాత్రం వీలులేదు. కనుక, యీనాడు, నా సంపత్తిని సంరక్షించుకొనుటకు కటుమార్గం అవలంబిస్తే తప్పా? అలాంటి మార్గాన్నే అవలంభించకపోతే యికనాకు మిగిలేదేముంటుంది? ఈనాడు ప్రజలు నాకు అదనంగా ఏమీ యివ్వటంలేదు; యివ్వరు! ఈనాడు వారు నాకు యివ్వవలసింది

యివ్వటం, నేను పుచ్చుకోవటం మాత్రమే. యింతే మా మధ్య సంబంధాలు. దానాలు ధర్మాలుచేస్తూ కూర్చుంటే, యిక నేను బిచ్చమెత్తుకోవలసిందే! సంపత్తిని రక్షించుకోనటం, వంశగౌరవాన్ని సంరక్షించుకోనటం, యీనాడు అతి కఠినసమస్యలుగా రూపొంది కూర్చున్నాయ్!"

కొడుకు వ్రాసిన జాబును, కృష్ణగోపాలుడు చదువుకున్నాడు. ఈవిధంగా తన కొడుకు మారిపోయాడే అని ఆయన విచారపడ్డాడు. కాని, "ఈనాటి కుర్రాళ్ళు యీనాటికి తగినట్లుగా వ్యవరిస్తున్నారు. మా పాతకాలంనాటి పద్ధతులు ఏమాత్రం చలామణి కావిప్పుడు. నేను దూరాన కూర్చుండి, వాళ్ళ వ్యవహారంలో జోక్యం కలిగించుకుంటే, మీ సంపత్తిని మీరే రక్షించుకోండి, నాచేతకాదు, అని అంటాడు. నా కెందుకొచ్చినగోల! ఎవడికాక్కావాలి యీసంత! జీవితశేషాన్ని హరినామస్మరణ చేసుకుంటూ గడుపుతాను! ఇదే పదివేలు!" అని రాజీపరచుకున్నాడాయన తన మనస్సును.

## 2

ఈవిధంగా వ్యాజ్యాలు సాజ్యాలద్వారా విపినుడు, తన జమీాలోని భూమినంతా తన స్వాధీనంలోనికి తెచ్చుకున్నాడు. చాలామంది విపినుడంటే భయపడి, అతని అధీనమయ్యారు. కాని, ఒక్కడుమాత్రం కొరకరాని కొయ్యగా తయారయ్యాడు. అతడు మీర్జాబీబీ కొడుకు అచ్ఛిమద్ది విపినుడెంతగానో ప్రయత్నించాడు. కాని, వాడు మాత్రం స్వాధీనం కావటంలేదు.

విపినునకు అచ్ఛిమద్ధియంటే ఏమాత్రం పడేదికాదు. అతని పేరెత్తితే నిప్పులు కక్కసాగాడు. తన తండ్రి దాన మిచ్చుటచే దానిని బ్రాహ్మణులు అనుభవిస్తున్నారంటే దానికి అర్థంఉంది. బ్రహ్మత్వమే వారికి దానాన్నిపట్టే అర్హతను అనుభవించేఅర్హతను సంపాదించిపెట్టింది. కాని, తురకబిడ్డ యింత సంపత్తిని అనుభవించుటకు ఎలా అర్హుడో అతనికిఅర్థం కావటంలేదు ఒక సామాన్య తురకబిడ్డ ఏదో గ్రామంలోని బడిలో నాలుగు అక్షరాలు నేర్చుకొని, ఎవరినీ లక్ష్యపెట్టని వాడుగా తయారయ్యాడు !

విపినుడు కూపీతీయసాగాడు. ఎస్టేటులోని ముసలి నౌక ర్లను పిలిచి, అచ్ఛిమద్ధికి యింత సంపత్తి ఎలా లభించిందని ప్రశ్నించాడు. వృద్ధ జమీందారుగారి కాలంనుండి అనుభ విస్తున్నాడని, అతనికి జవాబుచెప్పారు. కాని, మూలకారణం ఏమిటో విపినుడికి అర్థంకాలేదు. బహుశః విధవయైన మీర్జా బీబీ తన దుఃఖపూరిత జీవితాన్ని, వృద్ధ జమీందారునిఎదుట వెళ్ళబోసుకుందేమో! ఆయన హృదయంకరిగి యింత ఆస్తి రాసియిచ్చాడేమో!

తన తండ్రి, ఈ మహమ్మదీయ కుటుంబంపై యింత దయచూపటం అంత ఉచితమైన పనికాదని విపినుడు భావింప సాగాడు. మీరుమిక్కిలి, మీర్జాబీబీ ఎలా దారిద్ర్యజీవితం వెళ్ళబోసిందో విపినున కేమాత్రం తెలియదు. కాని, యీనాడు, ఈ మహమ్మదీయ కుటుంబం అనుభవిస్తున్న భాగ్యభోగాదులను చూసి, తన తండ్రిని యీ కుటుంబం దోచుకొన్నదని భావింపసాగాడు విపినుడు.

అచ్ఛిమద్ధి, ఉద్రేకస్వభావంగల యువకుడు.

"ప్రాణంపోయినాసరే, ఈ ఆస్థిపై నాకుగల అధికారాన్ని రవ్వంతయినా వదలుకోను!" అన్నాడు అచ్ఛిమద్ధి.

"బేటా! మనం ఎవరి దయమూలంగా యింతభోగాన్ని అనుభవిస్తున్నామో, ఆ కుటుంబంపై కత్తికట్టం సబబుకాదు! వారిని గౌరవించటం, వారి అడుగులకు మడుగులొత్తటం శ్రేయస్కరం! ఎంతయినా, ఆయన జమీందారు, అందువల్ల మనం కొంత వదలుకోవటం మంచిది!" అన్నది మిర్జాబీబీ.

"నీకీగొడవలు తెలియవులే పోవమ్మా!" అన్నాడు అచ్ఛిమద్ధి.

విపినుడు, అచ్ఛిమద్ధిపై దావావేశాడు. అచ్ఛిమద్ధి, ఆ దావాలో ఓడిపోయాడు. ఓడిపోతున్నకొలదీ, అచ్ఛిమద్ధికి పెంకితనం, జాస్తి అయ్యింది. తన సర్వస్వాన్ని రక్షించుకోటానికి, సర్వస్వాన్నీ పణంగా పెట్టివేశాడు.

♦ ♦ ♦ ♦

ఒకనాటి సాయంత్రం, తన తోటలోని కూరగాయలు తీసికొని మిర్జాబీబీ, చాటుగా, అచ్ఛిమద్ధికి తెలియకుండా, విపినుడి యింటికి వెళ్ళింది.

వృద్ధురాలైన, మిర్జాబీబీ, కరుణపూరితమైన, మాతృదృష్టితో విపునుని సర్వాంగాలను సంస్పర్శించుచు, "బేటా! అల్లానీకు చిరాయువు నొసగుగాక! అద్దిమ్‌కు చెరుపుచేయబోకు బేటా! ఇది ధర్మంకాదు నాయనా! బిడ్డా! వాణ్ణి నీచేతుల్లో పెడ్తాను. పెంకితనంగా ఎదురుతిరిగిన తమ్ముణ్ణిగా వాణ్ణిభావించి క్షమించు నాయనా! నీ అనంత ఐశ్వర్యంలో వాడికి లభించింది

ఒక్క కణం మాత్రమే నాయనా! ఇదిచూచి, వానిపై కోప గించకునాయనా!" అని బ్రతిమాలసాగింది.

వృద్ధురాలిమాటలు, విపినుకి నచ్చలేదు.

"నీవు స్త్రీవి; ఈ వ్యవహారాలేమీ నీకు బోధపడవు. నీవేదైన చెప్పదలచుకుంటే, అవి నీకొడుకునకు చెప్పి, యిక్కడకు పంపు!" అన్నాడు.

మీర్జాబీబీ, విపినునుకి, నచ్చచెప్ప యత్నించింది. కాని ప్రయోజనం లేకపోయింది.

అల్లాపేరు తలచుకుంటూ, వృద్ధురాలు కన్నీళ్ళుతుడుచు కుంటూ వెళ్ళిపోయింది.

# 3

వ్యాజ్యం, మునసబుకోర్టునుండి, సబుకోర్టుకు, సబ్ కోర్టునుండి జిల్లాకోర్టుకు, జిల్లాకోర్టునుండి హైకోర్టుకుపోయింది. ఎంతకీ తెగనే తెగలేదు రమారమి రెండున్నర సంవత్సరా లయింది దావా ప్రారంభమై.

అచ్చిమద్ది, ఆకంఠం అప్పుల్లో మునిగిపోయాడు. హైకోర్టులో, ఎలాగైతేనేం, గెలిచాడు. పులినోటపడిన జంతువును, అదితినగా మిగిలిన భాగాన్ని నీటిలోని మొసలి మింగేసిందట! అలాగైంది అచ్చిమద్దిస్థితి. దావా నడిపించు టకు అప్పులు చేశాడుకదా! ఆ దావాలో అమితంగా వ్యయ మైపోయిందికదా! మిగిలిన ఆస్థిని అప్పులుపెట్టిన వాళ్ళు

డిగ్రీలు పొంది స్వాధీనం చేసుకోటానికి యత్నిస్తున్నారు. అతని ఆస్థి. వేలంపడే తారీఖుకూడ నిర్ణయింపబడింది.

ఆరోజు సోమవారం; సంతరోజు, నదీతీరంలో సంత జరుగుతూ వుంటుంది. అది వర్షాకాలం; నది నిండుగా వుంది సంతలో క్రయవిక్రయాలు జరుపుకోటానికి కొంత మంది నావలమీాద, కొంతమంది నడిచీ వచ్చారు. ఆషాఢ మాసం అవటంమూలాన, సంతలోనికి బోలెడన్ని పనసపండ్లు వచ్చాయి. ఇంకా అనేకరకాల వస్తువులు, కాయకూరలు వచ్చాయి. ఆకాశంలో మబ్బులు తిరుగాడుతూ ఉన్నాయ్.. ఎక్కడ వర్షం వచ్చిపడుతుందో అని వ్యాపారస్థులు గడబిడ పడుతున్నారు. వ్యాపారస్తులు, వర్షందెబ్బ తగులకుండా సామాన్లపై సంచులు వగైరా కప్పుతున్నారు.

ఆరోజున, అచ్చిమద్ది, ఆబజారులో తనకు కావలసిన వస్తువులు కొందామని వచ్చాడు. కాని, చేతిలో గుడ్డి గవ్వయినాలేదు. ఇటీవల అతనికి అప్పయిచ్చేవాళ్ళే కరువై పోయారు. అతడు ఒకగ్లాసు, ఒక యిత్తడిపళ్ళెం మూట కట్టుకొని వచ్చాడు. అవి తాకట్టుపెట్టి, అప్పుగా వస్తువులు తీసుకుపోవాలని అతని ఉద్దేశం.

అదేరోజున, సాయంత్రం గాలిమేద్దామని బయలు దేరాడు విపినబాబు. అతనివెంట లాఠీలు ధరించిన యిద్దరు జమాజెట్టీలు కూడా వున్నారు. బజారులో జరిగేసందడిని చూచిపోదామని కోరిక కలిగి, ఆయన యిటుగా వచ్చాడు.

సంతలో ప్రవేశించి, గేటుకావలావాడితో, వాని ఆదాయ వ్యయాలను గురించి అడుగుతున్నాడు. అదే

సమయంలో, అచ్చిమద్ధి కూడా అక్కడకు వచ్చాడు. విపిన బాబును చూడగానే, సింహంలాగున గర్జిస్తూ అచ్చిమద్ధీ, అతనిపైకి లంఘించాడు. కాని, సంతలోనివారు, అతణ్ణి దారిలోనే అటకాయించారు. వెంటనే, అతణ్ణి, పోలీసు లకు అప్పగించారు, సంత యథాప్రకారంగా జరుగసాగింది. ఇంతవరకు జరిగిన సంఘటనలు ఒకయెత్తూ, యీనాటి సంఘటన మరియొకయెత్తు! ఆమె తరఫున నిలబడి జమీందా రుతో యుద్ధం చేయగలిగినవారెవ్వరూ ఆమెకులేరు. ఆ కుటీ రంలో దీపంలేదు. సంతోషంలేదు. అస్థిపంజరం లాగున్న మీర్జాబీబీ హతాశయై, భీతహృదయయై దుఃఖిస్తోంది.

## 4

ఈవిధంగా మూడురోజులు గడిచినాయి. రేపటిరోజున డిప్యూటీ మేజిస్ట్రేట్ గారి కోర్టులో అచ్చిమద్ధీని విచారణ చేస్తారు. సాక్ష్యం చెప్పటకు విపినబాబు స్వయంగా కోర్టుకు రావాల్సివచ్చింది. ఇంతకు పూర్వం ఇలాంటి సంఘటనలేవైనా సంభవిస్తే జమీందారైనవాడు కోర్టుకు హాజరై, బోనెక్కటం అనే అలవాటులేదు. కాని, విపినబాబు బోనెక్కి సాక్ష్యం చెప్పటానికి సిద్ధపడ్డాడు. ఇది తనమర్యాదకు భంగమని అతడు భావించలేదు.

ఈసంఘటనవలన, విపినబాబు సంతోషపడ్డాడా అంటే అదేమీ లేదనేచెప్పాలి. మనం ఏ జంతువునైతే వేటాడదల చామో, ఆ జంతువే మనలను కొట్టటానికి పంజాయెత్తి మన

పైకివస్తే దాని పొగరును, అఘాయిత్యాన్ని సహిస్తామా? సహించం, చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవా!

ఈసంఘటన విపినబాబుగారి అంతఃపురంలో తెలిసింది. అంతఃపురస్త్రీలు, "అయ్యో! తల్లీ! ఎంత పొగరుబోతు వెధవ! ఎంత దుష్టుడు!" అన్నారు.

వానికి తగినశిక్షపడుతుందని విని, వారు ఊరడిల్లారు.

విధవరాలైన, వృద్ధురాలైన అచ్చిమద్దియొక్క తల్లి; అన్నహీనమైన, పుత్రహీనమైన కొంపలో కుప్పకూలింది, మృత్యుదేవతకోసం ఎదురు చూడసాగింది. దీపరహితమైన గుడిసెలో కుక్కిమంచంలో కుమిలిపోతోందాతల్లి!

మరునాడు, సరిగా సమయానికి టోపీ ధరించి, గొలుసు గడియారం ధరించి, పల్లకీ ఎక్కి, విపినబాబు కోర్టులో సాక్ష్యం చెప్పటకు బయలుదేరాడు. కోర్టులో యీనాడు జనం గుంపులు గుంపులుగా మూగినారు. ఇలాంటి కేసు జరిగి చాలా సంవత్సరాలైంది.

కేసు ప్రారంభమవుటకెంతో సమయంలేదు. కాని, యింతలోనే ఒక నౌకరువచ్చి విపినబాబుగారి చెవిలో ఏదో చెప్పాడు. విపినబాబు అది విని వెంటనేలేచి, బయటకు వెళ్ళాడు.

బయటకురాగానే విపినబాబునకు ఒకచెట్టుక్రింద నిలబడి యున్న తన ముసలితండ్రి అగుపించాడు. వృద్ధ జమీందారు నకు కాళ్ళకు చెప్పులులేవు. హరినామాంకితమైయున్న దుంది టిని కప్పుకొనియున్నాడు. ఆయన చేతిలో జపమాలవున్న.

దేహం కృశించి ఉంది. ముఖం స్నిగ్ధజ్యోతిర్మయంగా ఉంది అతని లలాటంపై, ప్రశాంతమైన కరుణారసం తాండవిస్తున్నది.

విపినుడు, సూటు బూటులోవున్నాడాయె! అతికష్టం మీద వంగి, తండ్రికి నమస్కరించాడు. దాని మూలంగా, అతని నెత్తిమీద ఉన్న టోపీ క్రిందపడింది. జేబులోని గడియారం క్రిందపడింది. వెంటనే, ఆరెండింటిని తీసి, సర్దుకున్నాడు.

"నాన్నగారూ! మీరు, యీ సమీపంలోవున్న మన వకీలుగారింటికివెళ్ళి, విశ్రాంతి తీసుకోండి! "అన్నాడు విపినుడు.

అందుకు, కృష్ణగోపాలుడు, "లేదు! బిడ్డా! నేను చెప్ప దలచుకున్నది యిక్కడే చెపుతాను!" అన్నాడు.

విపినుడు, తమచుట్టూ మూగినజనాన్ని, నౌకర్లను దూరంగా పొమ్మని చెప్పాడు. వాళ్ళందరూ వెళ్ళిపోగానే కృష్ణగోపాలుడు చెప్పసాగాడు.

"బిడ్డా! అచ్చిన్ విడుదలకు ఎలా ప్రయత్నిస్తే వీలు పడుతుందో అది వెంటనే చెయ్యి! అతనివద్ద గుంజుకున్న ఆస్థిని అతనికిచ్చివెయ్యి!"

విపినుడు విస్మితుడై, "దీనికోసమా మీరు కాశీనుండి యింతదూరంవచ్చింది? వానిమీద యింతదయ దేనికో?" అన్నాడు.

"అది విన్నందువలన నీకు కలిగేలాభ్థం?" అన్నాడు కృష్ణగోపాలుడు.

అందుకు విపినుడు, "నాన్నగారూ! అయోగ్యులని తలచిన వారందరినుండి మీరిచ్చిన దానాలను తిరిగి రాబట్టుకున్నాను. అందులో ఎంతమందో బ్రాహ్మణులున్నారు—

కాని, మీరు వారికోసం జోక్యం కల్పించుకోలేదు! కాని, యీనాడు, సామాన్య మహమ్మదీయుని విషయంలో యింత కష్టపడుతున్నారంటే, చాలా ఆశ్చర్యంగావుంది! ఇంత వ్యవహారం నడిపినతరువాత, వాని ఆస్తి వానికి వాపసుచేస్తే లోకు లేమనుకుంటారు?" అన్నాడు.

కృష్ణగోపాలుడు, కొంచెంసేపు మౌనం వహించాడు చిట్టచివరకు, వణుకుతున్న వ్రేళ్ళతో జపమాలను త్రిప్పుతూ,

"లోకులకు, యీ వ్యవహారమంతా చెప్పదలచుకుంటే, అచ్ఛిమద్ది నీకు తమ్ముడవుతాడనీ, వాడు నాకొడుకనీ చెప్పు!" అన్నాడు.

విపినుడు ఉలిక్కిపడి, "మహమ్మదీయ వనితకు పుట్టిన వాడా!"

"అవును! మహమ్మదీయ వనిత గర్భంలో నాకు పుత్రుడుగా పుట్టాడు!"

విపినుడు, చాలాసేపటివరకు స్థాణువువలెఉండిపోయాడు.

"ఈ విషయాలన్నీ తరువాత మాట్లాడుకుందాం. మీరిప్పుడు యింటికి వెళ్ళండి!" అన్నాడు విపినుడు.

అందుకు కృష్ణగోపాలుడు, "లేదు. ఇంట్లో అడుగు పెట్టను! ఇక్కడనుండే తిరిగిపోతున్నాను. నీ ధర్మాన్ని అనుసరించి, ఏది ఉచితమనుకుంటావో అది చెయ్యి!" అన్నాడు. అని, చెప్పి, వెంటనే అక్కడనుండి వెంటనే వెళ్ళిపోయాడు కృష్ణగోపాలుడు.

పాపం విపినుడు ఏమిచేయగలడు. ఏమిచేయాలో అతనికి తోచలేదు. కింకర్తవ్యతా విమూఢునివలె నిలబడి

పోయాడు. కాని, అతని మనస్సులో, ఆకాలంనాటి ధర్మ నిష్ఠ అటువంటిదై ఉండవచ్చు అన్న అభిప్రాయం తప్పకుండా కలిగివుంటుంది. ప్రవర్తన విషయంలో, తన తండ్రికన్న తానే గొప్పవాడనని విపినుడు భావిస్తూ వుండేవాడు. ఇదంతా, జీవితానికొక సూత్రమంటూ లేకపోవటంవలన ఏర్పడు దుష్టఫలితమని, విపినుడు భావించాడు.

విపినుడు. కోర్టులోనికి తిరిగివచ్చాడు. పోలీసుల మధ్య, బక్కచిక్కివున్న, తెల్లని పెదవులుగల అచ్చిమద్ది నిలబడి యుండుటను విపినుడు చూశాడు. అచ్చిమ్ కళ్ళు మిలమిల్లాడుతున్నాయ్. అతడు విపినుని సోదరుడు!

మేజిస్ట్రేటుతో విపినునకు స్నేహం వుంది కేసును కలగాపులగం చేయించాడు. రఫీమని కొట్టివేయించాడు. అచ్చిమద్దే కొద్దిరోజులలోనే పూర్వపు ఆస్థిని తిరిగిపొందాడు. దీనికి కారణమేమిటో అతనికి తెలియదు. గ్రామంలోనివారం దరూ కూడా యిదిచూసి, ఆశ్చర్యపడ్డారు.

కేసుసమయంలో కృష్ణగోపాలుడు వచ్చాడన్న సంగతి అందరికీ తెలిసిపోయింది. అప్పుడు, జనం, చెవులు కొరుక్కోసాగారు.

సూక్ష్మబుద్ధియైన వకీలు, విషయాన్నంతటినీ గ్రహించాడు. వకీలుగారి పేరు రామశరణుడు. ఆయన్ని తన సొంత ఖర్చుతో కృష్ణగోపాలుడు చదివించాడు. వకీలుగారికి, కృష్ణగోపాలుని అవ్యాజ కరుణపట్ల సందేహం కలుగుతూనే వుండేది. కాని, యిన్నిదినాలైన తరువాత, సాధువుల జీవితాలన్ను పరిపూర్ణంగా శోధిస్తే, వారియదార్థ స్వరూ

పాలు తప్పక బయటపడతాయన్న విషయం, వకీలుగారికి పూర్తిగా అర్థమైంది.

ఈ ప్రపంచంలో, సాధువులకు, సాధువులుకానివారిలో భేదమేమంటే సాధు వేషధారులలో కపట ముంటుంది. సాధువులు కానివారిలో కపటం వుండదు.

ఏదిఏమైనా కానీయండి! కృష్ణగోపాలునియొక్క జగద్విఖ్యాతమైన దయ, ధర్మము, మహాత్మ్యము, అన్నీ కపటంతో కూడుకున్నటువంటివే! రామ శరణునకు, యిన్నాళ్ళుగా అవకాశంకాకుండావున్న సమస్యకు, యీనాడు, యిట్టె సమాధానం దొరికింది అంతేకాదు. ఏయుక్తి ననుసరించో ఏమో తెలియదుగాని, వకీలుగారి భుజస్కంధాలపై నుండి కృతజ్ఞతా భారం తొలగిపోయింది.

—(...)—

# చీట్ల పేక దేశం

## (వ్యంగ్య రచన)

ఇక్కడకు చాలాదూరంవుంది. ఒక పెద్ద సముద్రంఉంది. ఆ సముద్రం మధ్యలో ఒక పెద్ద ద్వీపంఉంది. అక్కడ పేక రాజు, పేకరాణి, పేకఆసు, పేకజాకీఉన్నారు. వారిదే ఆ రాజ్యం. రెండు, మూడునుండి తొమ్మిది, పదివరకు గృహస్థులున్నారు. కాని వారు కులీనులుకాదు. ఆ పేకరాజ్యంలో, ఆసు, రాజు, జాకీ అనేవే ప్రధానకులాలు. తొమ్మిది, పది అనేవి అన్యకులానికి అంటే నీచకులానికి జెందినట్టివారు. వారు రాజు, రాణి, జాకీ, ఆసుగార్ల ప్రక్కన కూర్చోటానికి వీలు లేదు. కాని, యిదేమైనా వింతయిన నిబంధనా అంటే అదేమీ కాదు. ఎవరికేది అర్హమైన స్థానమో, ఎవరెక్కడ కూర్చుండాలో యింతకు చాలాకాలం క్రిందటే నిర్ణయించబడి వుంది. ఒక చిన్నం అటూయిటూ కదల్చటానికి వీలులేదు. వారందరూ వారివారి నియమితాలను అనుసరించి, పనిచేస్తూ ఉంటారు. వంశానుక్రమాన్ని అనుసరించి తమ పూర్వుల అడుగుజాడల్లో నడుస్తూఉంటారు.

వారి నిత్యకృత్యములు, జీవితవిధానం, విదేశీయులకు అవగాహనమవుట, చాలాకష్టం. అదొక వంకరటింకర రేఖగాకి విదేశీయులకు అగుపడుతుంది. మొదట పేకాట కొత్తవాని, అలాగే ఉంటుందికదా! కేవలం, నియమాల ననుసరించి,

కూర్చోవటం, నియమాన్ని అనుసరించి నడవటం, నియమాన్ని అనుసరించి లేవటం, యివి ఆ దేశంలో పద్ధతులు. అదృశ్యహస్తంచే నియంత్రితులై ఆ పేకమహారాజ్యంలోని వారు నడుస్తూ ఉంటారు. వారి ముఖమండలాలపై ఎలాంటి భావ పరివర్తనమూ కలుగదు. చిరకాలమునుండి, వారి ముఖమండలాలపై ఒకే భావం ముద్రింపబడివుంది అదెలాంటి భావమంటారా? చిత్రపటమొకటి కళ్ళు పత్తికాయలంతేసి చేసుకుని చూస్తున్నట్లు! ఆదాము, పూర్వకాలం నాటి నుండి, ఈనాటివరకు ఆరాజ్యంలోనివారి టోపీలలోగాని, పాదరక్షలలోగాని, మార్పేమీ రాలేదు.

దీనినిగురించి పట్టించుకున్నవారూ లేరు; పట్టించుకోవలసిన అవసరమూ లేదు; ఆలోచించాల్సిన అవసరమూలేదు. వారందరూ, ఏదో నిర్జీవ భావంతో తిరుగుతూవుంటారు. క్రిందపడేటప్పుడు, నిశ్శబ్దంగా క్రిందపడుతూ ఉంటారు. అవి చలితమైన ముఖకాంతిగల మనస్సుతో, ఆకాశంవంక చూస్తూ ఉంటాయి.

ఆ రాజ్యంలోనివారికి, ఒక ఆశగానీ, అభిలాషగానీ, భయంగానీ, చైతన్యంగానీ లేదు. విద్యాశూన్యులు వారు. పంజరంలోనున్న పక్షి రెక్కలను టపటపా కొట్టుకొంటూవుంటుంది. స్వేచ్ఛను కోరుతూ ఉంటుంది దాని హృదయం. కాని, చిత్రవత్ మూర్తుల అంతఃకరణలో, జీవించియున్న ప్రాణి యొక్క అశాంతమయమైన పశ్చాత్తాప లక్షణాలు ఏమాత్రం గోచరించవు. పంజరాలలో, జీవంగల ప్రాణులు నివసిస్తూ ఉంటాయి. ఆ సమయాలలో, పంజరాలు, ఊగుతూ ఉంటాయి.

అంతేగాదు; వాటినుండి దీనగీతాలాపనము, పదతాళగతి విన వస్తూవుంటాయి ఆ సమూహంలో, ఆ పంజరగ్రస్తప్రాణులకు తాము విహరించిన గంభీరారణ్యాలు, విశాలాకాశమూ జ్ఞప్తికి వస్తూవుంటాయి.

ఇప్పుడు కేవలం, పంజరంయొక్క సంకీర్ణాన్నీ, శృంఖలాబద్ధమైన శ్రేణీవిన్యస్తమైన, యినుప సంకెళ్ళను అనుభవించాల్సివస్తోంది. పంజరగ్రస్తమైన పక్షులు ఏనాడైనా స్వేచ్ఛాపూరితమైన జీవితాన్ని గడిపినారో, లేక, జీవన్మృతులవలె పడియుండేవో, ఎవరు చెప్పగలరు?

ఆశ్చర్యాన్ని గొల్పునటువంటి, స్తబ్ధత్వమూ, శాంతి, ఆరాజ్యంలో విహరిస్తున్నాయి. పరిపూర్ణమైన విశ్రాంతి, సంతోషాలు, ఆ రాజ్యాన్ని ఆలింగనమొనర్చుకొని ఉన్నాయి. వీథుల్లో, బాటల్లో, పేటల్లో, సముద్రతీరంలో సుసంయుతులుగా, సువిహితులుగా అగుపిస్తూ ఉంటారు. ఆ రాజ్యంలో పోట్లాడుకొన్నట్లుగానీ, ద్వంద్వాత్మకతగానీ, ఉత్సాహంగానీ ఆగ్రహప్రదర్శనంగానీ మచ్చుకైనా అగుపించవు. కేవలం నిత్యనైమిత్తికమైన, క్షుద్రమైన పనులు చేసుకుపోతూ వుంటారు, క్షుద్రవిశ్వాసాలు కలప్రజలు వారు.

ఆ ద్వీపాన్ని పరివృతించియున్న సముద్రం, అవిశ్రాంతపూరితమైన రాగాలాపనము గావించుచూ, ఆ ద్వీపతటాన్ని పరిశుభ్రమైన, ఫేనపూరితమైన. కోమలమైన, తన సహస్ర కరాలతో మృదువుగా తాకుచూ, ఆ ద్వీపాన్ని ఎడతీయని తియ్యని నిద్రలోముంచి ఉంచుతోంది. పక్షిమాతయొక్క

విప్పారిన నీలిరెక్కలవలె ఆకాశము ఆ ద్వీపముయొక్క దిగంతాల శాంతిని రక్షిస్తూవుంది.

ఆ ద్వీపానికి చుట్టూ అనంతమైన నీలనీరధము, నీలాకాశమూ ఉన్నాయ్. కనుచూపుకు అందని దూరంవరకు చిక్కని నీలిరంగు విదేశమువలె ద్యోతకమవుతూఉంటుంది ఆ విదేశంనుండి అచటి రాగద్వేషాల ద్వంద్వకోలాహాలం అనంత సముద్రాన్నిదాటి, యీద్వీపంవరకూ, రాజాలదు.

## 2

సముద్రానికి ఆవలివైపున ఒక దేశమున్నది. ఆ దేశములో ఒకరాణి ఉండేది. ఆమె నిత్యదుఃఖితురాలు. ఆమెకొక పుత్రుడున్నాడు. ఆ రాజపుత్రుడు తన తల్లితోపాటు సముద్రతీరాన ఒక భవనంలో బాల్యజీవనాన్ని గడుపసాగాడు.

అతడు ఒంటరిగా కూర్చుండి, అత్యంత సమధికమైన అభిలాషాపూరితమైన ఊహాజాలాన్ని నిర్మించుకొంటూ వుండేవాడు. ఆ జాలాన్ని దిగంతములవరకు విసిరివేసి, కల్పనామయజగత్తులోని క్రొత్తక్రొత్త వస్తువులను పోగుచేసి తన ద్వారంవద్ద గుట్టగాపోస్తూ ఉండేవాడు. అశాంతిపూరితమైన అతని మనస్సు సముద్రానికి ఆవలిఒడ్డుపైన, ఆకాశసీమమీదను తానవచ్చే, నీలిపర్వతపంక్తులకు ఆవలివైపున సర్వదా విహరిస్తూ ఉండేది. పక్షిరాజుయొక్క గుడ్డుం ఎక్కడుంది? సర్పరాజుయొక్క శిరోమణి ఎక్కడుంది? పారిజాతపుష్పం ఎక్కడుంది? బంగారు, వెండి వృక్షాలెక్కడున్నాయ్? సప్తసముద్రాలెక్కడున్నాయ్? పదమూడునదులెక్కడున్నాయ్? ఆ పదమూడు

నదాలకు ఆవలి వైపున దుర్గమమైన దైత్యభవనమెక్కడ? దానిలో స్వప్నసంభవమైన అతిలోక సౌందర్యరాసియైన రాజకుమారి ఎక్కడ నిద్రించుచున్నదో వెతకి తెలుసుకోవాలని అతడు కాంక్షిస్తూఉండేవాడు.

రాజపుత్రుడు చదువుకొనుటకు పాఠశాలకు పోతూ వుండేవాడు. చదువుకు స్వస్తిజెప్పి, సముద్ర వ్యాపారస్థుని పుత్రునినుండి దేశవిదేశములకు సంబంధించిన విషయాలను, కొత్వాలుయొక్క కుమారునినుండి భేతాళకథలను నేర్చుకుంటూవుండేవాడు.

చిటపట చినుకులుపడుతూ వర్షిస్తున్న సమయంలో రాజకుమారుడు – ఆకాశం గాఢమేఘావృతమై, అంధకార బంధురంగాఉన్న సమయంలో – తన గృహద్వారంవద్ద తల్లి ప్రక్కన కూర్చుండి, సముద్రం వంక చూచుచూ – "అమ్మా! చాలాచాలా దూరదేశానికి సంబంధించిన కథ చెప్పవమ్మా!" అంటూ ఉండేవాడు.

ఆ తల్లి, తాను చిన్నతనంలోవిన్న ఏదో అపూర్వదేశమునకు సంబంధించిన అపూర్వకథను వినిపిస్తూవుండేది. వర్షించే మేఘాలుచేస్తుండే ధ్వనులతోపాటు తల్లి చెపుతున్న కథను వింటూ అతని హృదయం ఉదాసీనతనుజెందేది.

ఒకనాడు సముద్రవ్యాపారస్థుని పుత్రుడు, రాజకుమారునితో ఇలాఅన్నాడు.

"భాయీ! చదువు పూర్తిఅయిపోయింది. ఇక దేశదేశాలు చుట్టిరావటానికి బయలుదేరుతున్నా. బయలుదేరబోయేముందు మీ సెలవు తీసుకుందామని వచ్చా!"

అందుకు రాజకుమారుడు, "నేనుకూడా నీతో వస్తా!" అన్నాడు.

అదివిని కొత్వాలు తనయుడు, "నన్ను ఒక్కడినే యిక్కడ వదలిపోతారా? నేనూ మీతోవస్తా!" అన్నాడు.

రాజపుత్రుడు దుఃఖితురాలైన తల్లివద్దకుపోయి, "అమ్మా! దేశాలుచుట్టివచ్చుటకు పోతాను! నీ దుఃఖనివారణకు ఉపాయాన్ని తెలుసుకొనివస్తాను!"

తల్లి ఆశీర్వాదాన్నిపొంది, ఆ ముగ్గురు బంధువులు, దేశాలు తిరిగిరానటానికి బయలుదేరారు.

## 3

సముద్రంలో సముద్ర వ్యాపారస్థుని నావలు పన్నెండు సిద్ధంగాఉన్నాయి. వారుముగ్గురు నావ ఎక్కారు. దక్షిణానిలముచే నావల తెరచాపలు నిండినాయి. రాజకుమారుని హృదయవాసనవలె నావలు పరుగెత్తసాగినాయి. వారి నావలు శంఖద్వీపాన్ని చేరుకున్నాయి. అచట ఒక నావనిండా శంఖాలు నింపుకున్నారు. అటుతరువాత చందనద్వీపానికి పయనించినాయి ఆ నావలు. అక్కడ ఒక నావనిండా చందనపుముక్కలు వేసుకున్నారు. అచటినుండి బయలుదేరారు. ప్రవాళద్వీపాన్ని చేరుకున్నారు. అచట ఒక నావనిండా ప్రవాళములను ఎక్కించారు.

ఈవిధంగా వారు సముద్రంలో నాలుగు సంవత్సరాలు యాత్ర సాగించారు. ఈకాలంలో, గజద్వీపానికి పోయి,

గజదంతాలను ఒక నావనిండా వేసుకున్నారు. కస్తూరిద్వీపానికిపోయి, ఒక నావనిండా కస్తూరి వేసుకున్నారు లవంగ ద్వీపానికి పోయి, లవంగాలను ఒకనావనిండా నింపుకున్నారు. జయఫలదీవికి బోయి, జయఫలములతో ఒక నావను నింపుకున్నారు.

సముద్రంలో ప్రయాణిస్తున్న సమయంలో, ఎక్కడనుండో బ్రహ్మాండాతుసిలాగున వచ్చిపడిందొక తుఫాను! ఆ తుఫాను శంఖాలున్న నావను లంకించుకుంది. దానిని తన కరకు కరాలతో ఎడాపెడా కొట్టింది. నావ బ్రద్దలైపోయింది; శంఖాలతో సహా సముద్రగర్భంలో లీనమైపోయింది అటు తరువాత, తుఫాను, చందనపు చెక్కలున్న నావను పట్టుకుంది. దానినికూడా తునాతునకలు జేసింది. చందనపు చెక్కలు చెల్లాచెదరైపోయినాయి సముద్రమంతా కప్పివేసినాయి. కస్తూరి గజదంతాలు, ప్రవాళాలు, లవంగాలు, జయఫలాలున్న నావలు తమ మిత్రుల దారినే నడచి, సముద్రగర్భంలో లీనమైపోయినాయి.

ఇక మిగిలిందల్లా, రాజకుమారుడు, అతని మిత్రులిద్దరు ఉన్న నావ మాత్రమే. ఆనావ బిక్కుబిక్కుమంటూ, పయనిస్తూ, తుఫానుగాలి బలవేగాన్ని అనుభవిస్తూ, దానితో లయతాళాలను కలుపుతూ, ఒక ద్వీపానికిపోయి కొట్టుకుంటుంది. ముక్కలుముక్కలైపోయింది.

ఈ ద్వీపంలోనే, పేకరాజు, రాణి, ఆసు, జాకీలు, నియమానుసారంగా జీవిస్తున్నారు. తొమ్మిదిపదులు వారికి ఊడిగం చేస్తున్నారు.

పేకరాజ్యంలో యింతవరకు ఎలాంటి ఉపద్రవమూ సంభవించలేదు. ఇప్పుడొక గడబిడ బయలుదేరింది. ఇదే ప్రథమపర్యాయం.

ఇన్ని సంవత్సరాలు గడిచినతరువాత, పేకరాజ్య ప్రజలలో, మొట్టమొదటిసారిగా, తర్కవితర్కాలు బయలుదేరినాయి. ఆతర్కవితర్కాలు దేనికి సంబంధించినవి?

ఆ ద్వీపానికి ముగ్గురు మనుష్యులు వచ్చిపడ్డారు. ఇది హఠాత్సంఘటన! ఆ ముగ్గురు, ఒకనాటి సాయంత్రం సముద్రంలోనుండి తీరానికి వచ్చారు. ఈ ముగ్గురిని ఏ శ్రేణిలో ఉంచాలి? ఏతరగతిలో జమకట్టాలి? ఏకులంవారని నిర్ణయించాలి?

మొట్టమొదటగా, వీరి జాతినిగురించి ఆలోచనలు సాగినాయి. వీరు ముగ్గురు. ఆసుజాతికి జెందినవారా? లేక రాజవర్గానికి జెరిదినవారా? లేక జాకీజాతికి జెందినవారా? లేక మరేలా, పదులుజాతికి జెందినవారా? ఎవరు వీరు? ఏకులానికి, ఏవర్గానికి జెందినవారు?

వీరి కుల గోత్రాలేమిటి? అధికారగోత్రమా? చిలకపలుకుల గోత్రమా? కూరగాయల గోత్రమా? రాళ్ళురప్పల గోత్రమా? ఏగోత్రానికి జెందినవారు?

వీరి కులగోత్రాలెరుగకుండా, వీరితో వ్యవహరించుట అసాధ్యమైన వ్యవహారం! వీరు ముగ్గురు, ఏకులమువారు వండిపెడితే తింటారు? ఎవరి యిండ్లలో నివసించుటకు వప్పుకుంటారు? అన్న సమస్యలు ఉత్పన్నమయినాయి. అధికారభేదాన్ని సూచిస్తాయిదిశలు. ఆరాజ్యంలో వీరి ముగ్గురిలో,

వాయువ్యదిశలో తలపెట్టుకొని, ఎవరు నిద్రపోవాలి? నైఋతి దిశలో తలపెట్టుకొని ఎవరు నిద్రించాలి? ఈశాన్యదిశలో తల పెట్టుకొని, నిద్రించవలసింది ఎవరు? ఎవరు నిలబడి నిద్రించాలి? అన్నవిషయాలమీద చర్చలు సాగినాయి. తర్జనభర్జనలు సాగినాయి. కాని, ఏవిషయంపైనా, ఒక్కరైనా, ఒక్క నిర్ణయానికైనా రాలేకపోయారు.

ఈ రాజ్యంలో, యిలాంటి క్లిష్టమైన, కష్టమైన, సంక్లిష్టమైన సమస్య, యిదివరలో ఏనాడూ ఉత్పన్నమైన పాపానపోలేదు.

ఆ రాజ్యంలోని ప్రజలు యిలా కొట్టు మిట్టాడుతూ ఉండగా, క్షుదాపీడితులగు ఈ ముగ్గురు మిత్రులకు, యిదేమీ యిసమంతయినా పట్టినట్లు లేదు. వారికి, ఏదోరకంగా ఆహారం లభిస్తే, ప్రాణాలు నిలబడుతాయి. వారు ముగ్గురూ ఆహారాన్వేషణ ప్రారంభించారు.

ప్రజలలో, వారికి ఎవరు భోజనంపెట్టుటకు సిద్ధపడలేదు. ఎవరికివారే సందేహించసాగారు. ఎవరిమటుకు వారు శాసనాలు, శాస్త్రాలు వెతుకసాగారు. ఈ సమస్య చర్చించుటకు అనుమహాశయుడొక మహాసభను జరిపాడు అది అదనుగా తీసి, మిత్రత్రయం, ఊరిమీదపడి, దొరికినదానిని తినసాగింది.

వారీవిధంగా, కులగోత్రాలను, వర్ణ వర్గభేదాలను పాటించకుండా, దొరకిన దానిని తింటూవుంటే, ప్రజలు విస్తుబోయారు, ఆఖరికి, రెండూ మూళ్ళుకూడా విస్తుపోయినాయి.

మూడవది తక్క రెండవదానితో యిలా అంది.

"సోదరీ! వీరికి కులపట్టింపు లేమాత్రం లేవన్లేవుంది!"

అందుకు రెండవది గుగ్లీ, యిలా జవాబు చెప్పింది.

"చూస్తే వీళ్ళు, మనకన్న నీచకులానికి జెందినవాళ్ళల్లే వుంది!"

మిత్రత్రయానికి పొట్టనిండేసరికి ఎక్కడలేని సంతృప్తి కలిగింది. అప్పుడు వారు ముగ్గురు పరిసరాలను పరికింపసాగారు.

ఈ దేశప్రజలు తీరుతెన్నులు ఆచారవ్యవహారాలు మిత్రత్రయానికి క్రొత్తవిగా అగుపించినాయి. ప్రపంచంలో యిలాంటి జాతి ప్రజలు వారికి ఎక్కడా అగుపించలేదు. వీరి ద్వీపాన్ని ఎవరో పెకలించివేసి జనసంపర్కంలేని ద్వీపంగా, నాగరిక ప్రపంచానికి దూరంగా పడవేశాడా? ఈ రాజ్యప్రజలు ఒకరకంగా హతబుద్ధులై, బాహ్యజగత్తుతో సంపర్కాన్ని విసర్జించి గిరగిరా తిరుగుతూవుండే ధూమమేఘంలాగున తిరుగుతున్నారా? అనిపించింది మిత్రత్రయానికి.

"వీరేమిపనిచేసినా యంత్రాలులాగున ఎవరో నడుపుతున్న యంత్రాలులాగున చేస్తున్నారు. వీరిలో స్వచ్ఛంద ప్రవర్తనము ఏమాత్రమూ కానరాదు. వీరి ప్రవర్తనం తోలుబొమ్మ లాడించువాని చేతిలోని తోలుబొమ్మలు మాదిరిగా వుంది. వారి ముఖాలలో ఏభావమూ కనిపించటలేదు. పోనీ ఏదైనచింతయినావుండా అంటే అదీ అగుపించదు! అందరూ గంభీరముద్రాహితులు, యథానియమానుసారం జీవితరథాన్ని సాగిస్తున్నారు. అయినప్పటికి యిదంతా ఒక మహాఅద్భుత విషయంగావుంది.

నలుదెసలావున్న యీజీవిత నిర్జీవిత గాంభీర్యాన్ని చూచి రాజకుమారుడు ఆకాశం వంకచూచి పకపకనవ్వా

సాగాడు. ఈ ఆంతరంగిక కేతుకముయొక్క ఉచ్ఛహాస్యధ్వని పేకరాజ్యంలోని స్మశానసమాన వీధుల్లోనివారికి విచిత్రంగా వినిపించింది. ఇచటి వజలెంత ప్రాచీనులు, సుగంభీరులంటే కౌతుకము తనంతటతాను ఉచ్ఛృంఖలముగా వెలునరించే అక స్మాత్తుగా వెలిగ్రక్కించే శబ్దాలనుండి తనంతటతానుగా చకితు రాలై, ఒక్కసారిగా ఆరిపోయింది. అంటే కౌతుకాన్ని ఆహ్వా నించేవారు ఆ రాజ్యంలో ఎవ్వరు లేకపోవటంవలన అది దానం తటదే నిస్తేజమైపోయింది. దాని స్థానాన్ని ద్విగుణీకృతంగా స్తబ్ధగాంభీర్యాలు ప్రవాహం ముంచెత్తివేసింది.

కోత్వాలుగారి పుత్రుడును, సముద్ర వ్యాపారస్థుని తన యుడును వ్యాకులమొంది రాజకుమారునితో యిటులన్నారు.

"సోదరా! ఆనందరహితమైన యీభూమిపై ఒక్క తుణమైనా బ్రతుకజాలం. ఈ రాజ్యంలో మరి రెండురోజు లుండటం తటస్థిస్తే బ్రతికున్నామా లేక చచ్చిపోయామా అని మధ్యమధ్య వళ్ళుతడుముకొని చూసుకోవలసివస్తుంది!"

అందుకు రాజకుమారుడిలా ప్రత్యుత్తరమిచ్చాడు.

"సోదరులారా! నాకేమాత్రం అలాంటిభావం కలుగుట లేదు. పైపెచ్చు కుతూహలం గలుగుతోంది. అదెలాగంటారా? చెపుతాను వినండి! ఈ రాజ్యంలోని ప్రజలు, చూడటానికి మనుష్యులవలె అగుపిస్తున్నారు. కాని, వీరిలో జీవపదార్థ మనేదేది లవలేశమైనావుందా లేదా? అని తెలుసుకోవాలని ఉమనా అందువలన, వీరిని ఒక్క కుదుపుకుదిపి చూస్తాను! ...ంటకోరిక!"

## 4

ఈ విధంగా కొన్నిరోజులు గడిచినాయి. విదేశస్థులైన ఈ ముగ్గురు మిత్రులు నియమమనే ఏ వలలోనూ చిక్కుకోకుండా విచ్చలవిడిగా సంచరించసాగారు.

ఎప్పుడు నిద్రలేవాలి? ఎప్పుడు నిద్రపోవాలి? ఎప్పుడు లేచి నిలబడాలి? ఎప్పుడు కూర్చోవాలి ? ఎప్పుడు ముఖం త్రిప్పేసుకోవాలి ? ఎప్పుడు బోర్లగా పడుకోవాలి ? ఎప్పుడు వెల్లకిలా పడుకోవాలి ? ఎప్పుడు తలవూపాలి ? ఎప్పుడు మొగ్గలు వేయాలి? ఈ నియమాలలో వేటినీ పాటించుటలేదు.

అంతేకాదు : పైపెచ్చు అలా చేస్తున్నవారిని చూచి నవ్వసాగారు. సర్వజనవేద్యమైన యీ అశేష క్రియాకలాపాలలో ఏదో మహత్తర గాంభీర్యంకలదన్న విషయాన్ని యీ మిత్రులు గుర్తించనూలేదు; దాని ప్రభావం వీరిపై పడనూలేదు.

ఒకనాడు ఆసుమహాశయుడు రాజుగారు, జాకీగారు, కట్టకట్టుకొని ఈ ముగ్గురు మిత్రులున్న తావునకు వచ్చారు. బొంగురు కంఠాలతో మహాగాంభీర్యాన్ని వెలిగ్రక్కుతూన్న కంఠస్వరాలలో రాజపుత్రుని యిలా ప్రశ్నించారు.

"ఏమయ్యా! మీరు నీతి నియమాలను అనుసరించి నడచుకోరేం ?"

అందుకు మిత్రులు ముగ్గురూ యిలా జవాబుచెప్పారు.

"మాయిష్టం!"

ఆమాట వినగానే పేకరాజ్యపు అధినాయకులు ఆశ్చర్యంలో మునిగిపోయారు. స్వప్నాభిభూతులవలె "ఇష్టమా? అదెలాంటిది?" అని ప్రశ్నించారు.

ఇష్టమంటే ఏమిటో వారికి అర్థంకాలేదు. కాని మెల్ల మెల్లగా వారికది బోధపడసాగింది. తాము జీవిస్తున్న విధంగానేగాక, మరియొకరకంగా కూడా జీవించవచ్చునన్న విషయాన్ని వారు ప్రతిరోజూ చూడసాగారు. ఇక్కడేరకంగా వుందో అక్కడకూడా అదేరకంగా వుందని-విదేశానికి జెందిన ముగ్గురు వ్యక్తులు - సజీవదృష్టాంతాలు - ఈ దేశానికి వచ్చి నేర్పిందేమిటంటే మానవుని పరిపూర్ణ స్వేచ్ఛకు సంకెళ్ళులేవని ఈ విధంగా పేకరాజ్యంలోనివారు ఇచ్ఛానామధేయమైన ఒక రాజశక్తియొక్క ప్రభావాన్ని అస్పష్టరూపంలో అనుభవింప సాగారు.

వారికావిధంగా అనుభవం కలుగుతూవుంటే పేక రాజ్యంలో ఆందోళనను కొద్దికొద్దిగా పొందసాగింది. ఆ ఆందోళనమెలాగున్నదంటూ రేమో! మహామేరువులాంటి కొండ చిలువయొక్క అనేక కుండలములలోపల మేల్కొల్పు అత్యంత మందగతిలో నడుస్తున్నట్లుగా వుంది.

## 5

నిర్వికార మూర్తులగు రాణులు, కులీనస్త్రీలు, యీనాటివరకు, కన్నెత్తి చూచి యెరుగరు. నిశ్శబ్దంగా, నిరుద్విగ్నంగా తమతమ పనులు చేసుకుంటూ కాలం గడుపుతూ

వచ్చారు. అది వసంతకాల సంధ్యా సమయం. రాణు లలో ఒకామె తన విశాల నేత్రములను పైకెత్తి రాజకుమా రునివంక చూడసాగింది. ఆసమయంలో ఆమె నేత్రాలలో ముగ్ధానురాగం గోచరమైనది.

రాజకుమారుడు చకితుడైనాడు.

"ఆశ్చర్యం! మహా ఆశ్చర్యం! ఈమె శిలాప్రతిమ యని భావించి, పొరపడ్డాను! సాక్షాత్తు రతీదేవి!"

కొత్వాలుగారి కుమారుణ్ణి, సముద్ర వ్యాపారిగారి పుత్రుణ్ణి రాజకుమారుడు ఏకాంతంలోకి తీసికొనివెళ్ళి వారితో యిలా చెప్పాడు.

"భాయీ! దీనిలో ఎంతో మాధుర్యం ఉంది! ఆమె తన నవీన భావంతో, నల్లని కళ్ళతో నాపై ప్రథమ కటా క్షాన్ని బరపింది! తత్ఫలితంగా నవజగత్తులో ప్రథమ ఉషా కాలంయొక్క ప్రథ ఉదయాన్ని చూచినట్లు నాకు అనిపిం చింది. ఇన్నిరోజులనుండి మనం యిక్కడ నివసించినందుకు సార్థకమైనదా కాలం!"

మిత్రులిద్దరు అతి కుతూహలంగా నవ్వుతూ "నిజం గానా?" అని ప్రశ్నించారు.

అభాగినియైన ఆపేకరాణి మరునాడు తన నియమా లను మరచింది. శాసనాన్ని అనుసరించి, ఏవేళలో ఎక్కడ హాజరు కావాలో అది మరచిపోయి నియమోల్లంఘనం చేయసాగింది. ఉదాహరణకు ఆమె జాకీపక్కన నిలబడవల సిన సమయం వచ్చిందనుకోండి, ఆమె ఆసమయంలో జాకీ ప్రక్కన నిలబడకుండా రాజపుత్రుని ప్రక్కన నిలబడసాగింది.

అప్పుడు జాకీ మహాశయుడు అవి చలితభావంతో "బేగమ్ సాహెబా! మీరు మరచిపోతున్నారు!" అని గంభీరంగా పలికేవాడు.

జాకీ ఆవిధంగా పలుకగనే రాణిగారి స్వాభావిక రక్త కపోలం మరింతగా ఎఱ్ఱబారేది. ఆమెగారి నిర్నిమేష అశాంత దృష్టి భూమిపై ప్రసరించేది.

ఆమెయొక్క దురవస్థను గాంచి రాజపుత్రుడంతట జోక్యము కల్పించుకొని "ఇందులో పొరపా టేమియూ లేదు. ఈరోజునుండి నేనే జాకీని!" అన్నాడు.

నవనవోన్మేషితయగు రమణీమణిహృదయంలో జనించి బహిర్గతమవుచున్న అభూతపూర్వశోభ ఎటువంటిది! ఎటువంటి అచింతనీయలావణ్యం వికసించుచున్నది! ఆ రీతిలోని మధురచాంచల్యమెటువంటిది! ఆమె దృక్కులందు ఎటువంటి హృదయతరంగములు కానవచ్చుచున్నవి? ఆమె అసిత్వములో మనుగడలో జీవితవిధానంలో ప్రాదుర్భవించుచున్న సుగంధమయ ఆ రక్తఉచ్ఛ్వాసము ఉచ్ఛ్వాసము గావించుచున్నది?

ఈ నవఅపరాధినియొక్క పొరపాటును సరిదిద్దాలనే ఆలోచనలు సాగించినవారుకూడా భ్రమలోపడసాగినారు. ఆసు మహాశయుడు తనకు సముచితమైన మానమర్యాదలను సంరక్షించుకొనుట మరచాడు. రాజూ జాకీలమధ్య యీనాడు భేదం నశించసాగింది. తొమ్మిది (మహేలా) పదులకుకూడా అదేగతిపట్టింది.

ఈ ప్రాచీనద్వీపంలో కోయిల యిదివరలో వసంత కాలంలో అనేకసార్లు కూసింది. కాని యీనాటి ధ్వానిస్వరం

అతిమధురంగా ఉందనిపించసాగింది. సముద్రం ఒకేరీతిగా పాట పాడుతూవస్తోంది. కాని యింతవరకు అది సనాతనధర్మమహిమను గురించి పాడుతూవచ్చింది.

దక్షిణ పవనముచే చంచలమైన, విశ్వవ్యాపితమైన, దురంతమైన, యవ్వనతరంగములలో అభివ్యక్తమయ్యే ప్రకాశము ఛాయలు, భావము భాషలచే పరితప్తమై వ్యాకులత్వమును వ్యక్తపరచసాగింది సముద్రం యీనాడు.

# 6

ఏమీ! పూర్వపు ఆసు మహాశయుడితడేనా? పూర్వపు మహారాజు యితడేనా? పూర్వపు జాకీ యితడేనా? వీరిలో ఆనాడు కానవచ్చిన పరితుష్ట, పరిపుష్ట సుగోళముఖకాంతి ఏదీ! ఎక్కడకుపోయింది?

ఒకడు ఆకాశం వంక చూస్తున్నాడు, మరియొకడు సముద్రపుటొడ్డున కూర్చుంటున్నాడు. ఇంకొకడికి రాత్రి నిద్ర పట్టటంలేదు. ఇంకొకనికి ఆహారం రుచించుటలేదు!

ఆసు మహాశయుడు యిట్లు తలపోయసాగాడు.

"రాజుగారు చూడటానికి అందగాడేకాని, ముఖంలో ఏమాత్రం కాంతిలేదు. నా రూపురేఖలు అద్వితీయం ఎంత చక్కగా వున్నానంటే నన్ను చూడకుండా ఏ వ్యక్తి కూడా ఉండలేడు!"

ఇక మహారాజు ఏమని భావింపసాగాడో చూద్దాం.

"ఆసు ఎల్లప్పుడూ గొప్పవాడే. గర్వంగా తలెత్తుకొని తిరుగుతూవుంటాడు తన్నుజూచి రాణులందరు తన్నువలచి వేస్తారని వానిభావంకాబోలు!"

అని సంభావించి రాజుగారు తిరస్కారసూచకమైన ఒక్క చిరునవ్వు నవ్వి తన ముఖాన్ని అద్దంలో చూచు కున్నాడు.

దేశంలోవున్న స్త్రీలందరూ చక్కగా సింగారించుకో సాగారు. కాని ఒకరినిచూచి మరొకరు తిరస్కారసూచకంగా "అరే! ఏమే అంత సింగారంచేసుకువస్తావు దేనికి? గర్వపోతుకి యింత సింగారమా? దాని రూపురేఖలుచూస్తూవుంటే లజ్జ కలుగుతోంది!" అనసాగారు అంతటితో ఆగేవారుకాదు మరింత గొప్పగా, హావభావములను ప్రదర్శింపసాగారు.

ఆ రాజ్యంలో ఏదో ఒకమూల ఇద్దరు మిత్రులమధ్య యిద్దరు స్నేహితురాళ్ళమధ్య రహస్యవిషయాలపై ప్రసంగం సాగుతూనేవుంది. అప్పుడప్పుడు చిట్టుబుట్టులాడుకుంటున్నారు. అప్పుడప్పుడు మానాభిమానాల ద్వంద్వయుద్ధం సాగుతోంది.

యువకులు బాటలప్రక్కనున్న చెట్లనీడక్రింద నేలపై పడియున్న ఎండుటాకులపై కాళ్ళుచాపి కూర్చుంటున్నారు. సోమరితనంగా కాలం వెళ్ళబుచ్చుతున్నారు. బాలికలు నీల వస్త్రములను ధరించి తమ మనస్సుల్లో నీలాకాశంలో విహరి స్తున్నారు. ఆదారిని వస్తూపోతూ, యువకులను జూచి తల వంచుకొని నడుస్తున్నారు. తాము ఎవ్వరినీ చూచుట లేనట్లుగా నటిస్తున్నారు. తమ అందచందాలను ఎవరికీ చూపించు టకు తామచటికి రాలేదన్నభావాన్ని ప్రదర్శిస్తూ నడుస్తున్నారు.

వారి నటనలను జూచి, పిచ్చి యువకుడెవడో ఒకడు దుస్సాహసంగా చటన లేచి నిలబడి వారివద్దకు పోతున్నాడు. కాని ఏమిచెప్పాలో ఒక్కమాట అయినా గుర్తుకు రాకపోయే సరికి హతబుద్ధియై నిలబడిపోయే అవకాశంకొరకు ఎదురు చూస్తూఉంటే ఆయువతి అతితీక్షణమువలె క్రమంగా మెల్ల మెల్లగా దూరంపోతూ విలీనమైపోతోంది.

నెత్తిపైన పక్షులు ఎగురుతూ మాట్లాడుకుంటూ వున్నాయి. గాలి చంచలంగా వీస్తున్నది. తేలిక వస్తువులను ఎగురవేస్తూ పోతోంది; మర్మరధ్వనులు గావిస్తూ పోతూవున్నది. తరుపల్లవములు చరచర మర్మరధ్వనులు గావిస్తూ వున్నాయి. సముద్రముయొక్క అవిశ్రామపూరితమైన ఉచ్ఛ్వాసితధ్వని హృదయముయొక్క అవ్యక్త వాసనలను ద్విగుణీకృతము గావించుచున్నది.

# 7

పేకరాజ్యం యీవిధంగా మహాగ్నిజ్వాలలమధ్య నున్నప్పటికీని దాని నావరించియున్న స్తబ్ధత్వము కోల్పోలేదని రాజపుత్రుడు గమనించాడు. ఎవరిముఖం చూచినా వారి నోటి నుండి ఒక్కమాట అయినా బయటకు రావటంలేదు. కేవలం ఒకరిమొఖాలొకరు చూసుకుంటున్నారు. మనస్సులోని భావాలను పిచ్చికగూళ్ళుగా యిసుకలో కట్టి పాడుచేసిపోతున్నట్టుగా వుంది. వారందరూ తమతమ యిండ్లలో ఒకమూల కూర్చుండి తమతమ రూపాలను ఆహుతి చేస్తున్నట్లున్నది. నానాటికి దిగనాసిల్లుతూ వాక్‌హీనులై పోవుచున్నారు.

కేవలం నేత్రాలుమాత్రమే సజలమవుతున్నాయి. ఆంతరంగిక ఆందోళనా ఫలితంగా పెదవులు గాలికి కంపించుచున్న పల్లవములు లాగున స్పందించుచున్నాయి.

రాజపుత్రుడు వారందరితో యిలా అన్నాడు.

"మురళిని తీసికొనిరండి. భేరీ మ్రోగించండి. ఆనందోత్సవం జరుపండి. పేకరాణి స్వయంవరం జరుగుతుంది!" వెంటనే మణేలా, పదులు మురళి మోగింపసాగినారు. దుక్కీ, తిక్కీలు భేరీ మ్రోగింపసాగారు. హఠాత్తుగా యీ ఆనందతరంగములమూలంగా గుసగుసలు మొహం చూచుకోవటాలు విరిగి పడిపోయినాయి.

ఉత్సవసమయంలో స్త్రీపురుషుల మధ్య హాస పరిహాసాలు వెల్లువలై పారసాగినాయి. వేళాకోళంలో మనసులోని కోరికలుతీరినాయి. కపటం, అవిశ్వాసాలు ద్యోతకమయినాయి. ఉచ్ఛహాస్యంలో తుచ్ఛ సంభాషణలు జనించినాయి. సాంద్రారణ్యంలో వాయువు వేగంగా వీచినప్పుడు శాఖోపశాఖలలోనూ, రెమ్మరెమ్మలోనూ, ఆకుఆకులోనూ, లతలలోనూ, వృక్షాలలోనూ పరస్పరమూ ఎలాంటి హావభావ సమ్మేళనం జరుగుతూ వుంటుందో అలాంటి దే వీరిలోనూ జరిగింది.

అలాంటి కలరవంలో ప్రాతఃకాలంనుండి మురళిద్వారా మోహనరాగం ఆలాపన జరిగింది. ఆనందంలో గాంభీర్యం, కలయికలో వ్యాకులత్వం, విశ్వదృశ్యంలో సౌందర్యం, హృదయంలో మోహానురాగములు సంచరింపసాగినాయి. చక్కగా ప్రేమించు ఎరుగనివారు చక్కగా ప్రేమింపసాగారు; ప్రేమించిన వారు ఆనందసాగరంలో మునిగిఉదాసీనులైపోయారు.

పేకరాణి రంగురంగుల చీరను ధరించింది. రహస్యంగా వుండే భాయీ కుంజంలో కూర్చున్నది. దూరంలో ఆలాపింప బడుచున్న మోహనరాగం ఆమె చెవులకు సోకుతున్నది; తన్మాత్రంగా ఆమె నేత్రములు ముద్రితమవుచున్నవి; ఒక భంగిమను దాల్చినవి. అకస్మాత్తుగా కళ్ళు తెరచి చూచినది: ఆమె సమీపంలో రాజపుత్రుడు కూర్చుండి ఆమెను చూస్తు న్నాడు. ఆమె అది చూచి భయకంపితయై రెండుచేతుల తోను కళ్ళు మూసుకున్నది.

రాజకుమారుడు డచటినుండి వెడలిపోయాడు. దినమంతా నదీతీరంలో తిరుగుతూ సంత్రస్తమైన దృక్కులను గురించి లజ్జా పూరితమైయున్న ఆమె ప్రవర్తనను గురించి దాని అర్థాన్ని అవగతం చేసికొనుటకు ప్రయత్నింపసాగాడు.

## 8

ఆనాటిరాత్రి శతసహస్రదీపాల వెలుగులో మాలా సుగంధంలో మరళీరాగాలాపనలో అలంకృత సుసజ్జిత సహస్య శ్రేణీబద్ధులైన యువకులసభ జరిగింది, ఆ సభలో మెల్లమెల్లగా కంపితచరణయై చేతనొక మాలనుధరించి ఒక బాలిక రాజ పుత్రుని వద్దకువచ్చి నిలబడినది. కాని, ఆమె తాను అభిలషిం చిన విధంగా ఆ మాలను అతని కంఠము వరకుకు ఎత్తజాలక పోయింది అంతేకాదు, తాను కోరుచున్న పురుషుని వంక కన్నెత్తిచూడలేకపోయినది. రాజపుత్రుడంతట తన తలను వంచాడు. ఆమె చేతినున్న పూదండ వణకుచూ పూరేకులను రాల్చుచూ అతని కంఠసీమ నలంకరించింది.

నిశ్శబ్దంగావున్న ఆసభ అకస్మాత్తుగా ఆనందోత్సాహపు వెల్లువలో కొట్టుకొనిపోయింది. సభికులందరూ కరతాళ ధ్వనులుచేశారు. వరకన్యను ఆశీర్వదిస్తూ తమతమ స్థానాలలో కూర్చున్నారు.

## 9

సముద్రమునకు ఆవలియొడ్డునున్న దుఃఖితురాలగురాణి బంగారు నావలో కూర్చుండి తన పుత్రుని క్రొత్త రాజ్యం లోనికి వచ్చింది.

చిత్రపటములోని దళములన్నీ అకస్మాత్తుగా జీవముగల మనుష్యరూపాన్ని ధరించినాయి. ఇప్పుడా రాజ్యంలో పూర్వం వలె అవిచ్ఛిన్నశాంతి గాంభీర్యాదులులేవు. ప్రపంచ ప్రవాహం తన సుఖదుఃఖాలను, రాగద్వేషాలను, విపదసంపదలను తీసుకొనివచ్చి ఊహానవీన రాజ్యాన్ని పరిపూర్ణం గావించింది.

ఈనాడు ఆ పేకరాజ్యంలో మంచివారు కొందరు, చెడ్డవారు కొందరు ఆనందమును సుఖమును పొందువారు కొందరు దుఃఖితులు కొందరూ. యిలా అనేక రకాలుగా ఏర్పడ్డారు. అయినప్పటికి వారందరూ మనుష్యులే.

ఈనాడు అనుల్లంఘనీయమైన శాసనాల మూలంగా ఏర్పడిన ఉదాసీనత్వం ఆ రాజ్యాలో ఎవరి ముఖంలోనూ కానరాదు. కాని, తన మనస్సులలోని ఇచ్ఛానుసారం సాధుస్వభావులుగాను, దుస్స్వభావులుగానూ రూపొందుతున్నారు.

శ్రీ కృష్ణా ప్రింటింగ్ వర్క్సు, విజయవాడ – 2